# ఏ మతములో ఎంత మతద్వేషము?




రచయిత : త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు



www.thraithashakam.org





# ఏ మతములో ఎంత మతద్వేషము?


రచయిత

**త్రిమత ఏకైక గురువు**

**ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, (64) చతుష్షష్ఠాధిక గ్రంథకర్త**

**ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త**

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము–37 ప్రథమ ముద్రణ : డిసెంబర్–2015

ప్రతులు : 1000 **వెల : 65 /-**

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక రచనలు

## ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు

1) త్రైత సిద్ధాంత భగవద్గీత.
2) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
3) ధర్మము-అధర్మము.
4) ఇందుత్వమును కాపాడుదాం.
5) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
6) దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు.
7) సత్యాన్వేషి కథ.
8) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా)
9) శ్రీకృష్ణుడు దేవుడా, భగవంతుడా.
10) గీతా పరిచయము (తెలుగు,ఇంగ్లీషు)
11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) జనన మరణ సిద్ధాంతము.
13) మరణ రహస్యము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా)
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
21) గీతం-గీత (పాటల జ్ఞానము).
22) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
23) దేవాలయ రహస్యములు.
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?)
26) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?)
27) తల్లి తండ్రి.
28) గురు ప్రార్థనామంజరి.
29) త్రైతారాధన.
30) సమాధి.
31) ప్రబోధ.
32) సుబోధ.
33) ప్రసిద్ధి బోధ.
34) సుప్రసిద్ధి బోధ.
35) సిలువ దేవుడా?
36) మతాతీత దేవుని మార్గము.
37) దేవుని గుర్తు - 963.
38) మతము-పథము.
39) ప్రబోధానందం నాటికలు.
40) ఇందువు క్రైస్తవుడా?
41) నిగూఢ తత్త్వార్థ బోధిని.
42) ఆత్మలింగార్థము.
43) నాస్తికులు-ఆస్తికులు.
44) హేతువాదము-ప్రతివాదము.
45) గుత్తా.
46) ప్రబోధ తరంగాలు.
47) త్రైత సిద్ధాంతము.
48) రూపము మారిన గీత.
**49) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.**
**50) మధ్యమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**51) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**52) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు (రెండవ భాగము)**
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) తీర్పు.
55) కర్మ పత్రము.
56) ప్రవక్తలు ఎవరు?
57) ధర్మశాస్త్రము ఏది?
58) మత మార్పిడి దైవద్రోహము.
59) త్రైతశక పంచాంగము.
60) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
61) స్వర్గము ఇంద్రలోకమా! - నరకము యమరాజ్యమా!!
62) జీహాద్ అంటే యుద్ధమా?
63) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
64) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
65) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
66) వార్తకుడు-వర్తకుడు.
67) దేవుని చిహ్నము.
68) ఏది నిజమైన జ్ఞానము?
69) ప్రతిమ×విగ్రహ-దైవము×దైయ్యము
70) మరణము తర్వాత జీవితము
71) ఏ మతములో ఎంత మతద్వేషము?
72) హిందూ మతములో సిద్ధాంతకర్తలు

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక ప్రసంగాలు

*DVD'S*

01. సంతకము.
02. సాంప్రదాయము.
03. త్రైతశకము.
04. కోడిపుంజు-పాదరసము.
05. యుగము-యోగము
06. నైజం-సహజం.
07. ఆత్మకు వెంట్రుక గుర్తు.
08. పైత్యం-సైత్యం.
09. శైవము-వైష్ణవము.
10. ఇందూమహాసముద్రము.
11. సృష్ఠి-సృష్ఠికర్త.
12. కాయ-పండు-కాయ.
13. జ్ఞానము-విజ్ఞానము.
14. వార-మాస-వత్సర.
15. సేకూవలి-కూలిసేవా.
16. ధర్మము-అధర్మము.
17. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
18. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
19. బట్టతల.
20. భగవంతుడు.
21. ద్రావిడులు-ఆర్యులు.
22. ప్రభువు-ప్రభుత్వం.
23. భూతం-మహాభూతం.
24. ప్రభు-ప్రజ.
25. యాదవ్.
26. పుస్తకము-గ్రంథము.
27. వెలుగుబంటు.
28. ప్రకృతి-వికృతి.
29. మాట-మందు.
30. ఏకత-ఏకాగ్రత.
31. హరికాలు-హరచేయి.
32. పుట్టగోసి-మొలత్రాడు.
33. 1 2 3 గురుపౌర్ణమి.
34. చమత్కార ఆత్మ.
35. క్షమించరాని పాపము.
36. మాయకుడు-అమాయకుడు.
37. మరణము-శరీరము
38. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
39. ద్వితీయుడు-అద్వితీయుడు
40. బయటి సమాజం-
లోపలి సమాజం.
41. సేవా శాతము.
42. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
43. శ్రీకృష్ణాష్టమి.
44. దేవునిజ్ఞానము-
మాయమహత్యము
45. తల్లి తండ్రి.
46. తల్లి తండ్రి-గురువు దైవము.
47. సమాధి.
48. మతము-పథము.
49. కలియుగము
50. దివ్యఖురాన్-హదీసు.
51. పుట్టుట-గిట్టుట.
52. తల్లి.
53. గోరు-గురు.
54. కర్మ మర్మము.
55. ఆత్మ.

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక ప్రసంగాలు

***DVD'S***

56. తాత.
57. గురుపౌర్ణమి.
58. ఇందువు-హిందువు.
59. శ్రీకృష్ణజన్మ మధుర.
60. ఆత్మపని.
61. కర్మ లేని కృష్ణుడు-
కర్మ ఉన్న కృష్ణుడు.
62. త్రైత సిద్ధాంతము
63. సహజ మరణం-
తాత్కాలిక మరణం.
64. స్త్రీ-పు / లింగము
65. దేశం మోసం-దేహం మోహం
66. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
67. జీర్ణ+ఆశయము
68. మేఘం ఒకభూతం-
రోగం ఒకభూతం.
69. దేవునికి మతమున్నదా?
70. ఇచ్ఛాధీన కార్యములు-
అనిచ్ఛాధీన కార్యములు.
71. ఏది ధర్మము
72. అధర్మ ఆరాధనలు.
73. మూడు పుట్టుకలు-రెండు జాగాలు
74. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
75. నిదర్శ - నిరూప
76. నటించే ఆత్మ
77. సంచిత కర్మ
78. గురువు ఎవరు?
79. శ్రీకృష్ణుడు ఎవరు?
80. సుఖము-ఆనందము
81. టక్కుటమారా, ఇంద్రజాల
మహేంద్రజాల, గజకర్ణ గోకర్ణ.
82. భయం
83. దశ-దిశలు.
84. ఆడించే ఆత్మ
85. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం)
86. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత
87. ఏది శాస్త్రము?
88. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
89. 6-3=6.
90. గుర్తింపబడనివాడు గురువు.
91. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
92. చంద్రాకారము (బట్టతల).
93. మతములలో పవిత్రయుద్ధము.
94. మూడు గ్రంథములు.
95. ఏడు ఆకాశములు.
96. దైవగ్రంథము
97. జ్ఞానము కబ్జా అయ్యింది.
98. భక్తి-భయము.
99. జ్ఞానశక్తి.
100. కాలజ్ఞాన వాక్యములు.
101. అర్థము-అపార్థము.
102. తోలేవాడు.
103. గురు చిహ్నం.
104. భక్తి-శ్రద్ధలు
105. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
106. పురుషోత్తమ
107. మతద్వేషము
108. నీ వెనుక వాడు
109. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.

## ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు లభించు చిరునామా

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 9866512667, 9951675081, Fax : 08558-225966.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 9705959390, 9985580099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
మార్కెట్‌స్ట్రీట్, ధర్మవరం, అనంతపురం (జి)
Cell:9440556968,9290012413,9440601136.

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్) : 9493622669
క్రొత్త చెరువు (గ్రా, మం) అనంతపురం జిల్లా.
9959316410, 9949995090.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 8185020272.

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell:9440047256, 9701956599

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం), శ్రీకాకుళం
Cell : 9494248963, 9959779187.

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
**దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం**
Cell:9491040963, 9032963963, 9848590172.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్
7674979663, 9440042763, 8977713666, 9247826253

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,విశాఖపట్నం (జిల్లా)
Cell : 7396492239, 9248315309, 7386212589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు), భీమిలి (మం),
విశాఖపట్నం (జిల్లా), 9441567394, 9502172711.

**వి. శంకర రావు** (టీచర్) (ప్రెసిడెంట్)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం, విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**డా॥బి. ధర్మలింగాచారి** (ప్ర.సభ్యుడు)
శ్రీ కనక మహాలక్ష్మి క్లినిక్,
(S కోట), విజయనగరము (జిల్లా).
Cell: 08966-275208, 9704911737

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
భీమవరం 1టౌన్, ప.గో.జిల్లా
Cell : 9948275984, 7386433834.

# ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు లభించు చిరునామా

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్)
MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**టి. వీరనారాయణ రెడ్డి** (ప్ర.సభ్యుడు)
బట్టేపాడు గ్రా॥ ఆత్మకూరు మం॥,నెల్లూరు జిల్లా
Cell : 9494618322, 8374923363

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)
చవటపాల్యం (గ్రా), నెల్లూరు జిల్లా.
Cell : 9494631664,9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
ఏటుకూరు రోడ్, దర్గామాన్యం,గుంటూరు (జి)
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి** (ప్ర.సభ్యుడు)
నరసరావుపేట, గుంటూరు జిల్లా
Cell : 9989204097, 9849555738

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**చెన్న ఆంజనేయులు** (కరస్పాండెంట్)
జ్ఞానోదయ హైస్కూల్, ఇటిక్యాల,
రాయికల్ మం॥, కరీంనగర్ (జిల్లా)
Cell : 95507 97782, 95538 30871

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట (మం), మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 8790558815, 9440655409, 9701261165.

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా Cell : 9440305700,

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం,చిత్తూరు జిల్లా. Cell : 9652755110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**వై. రేణుక దేవి** (ఇ.సభ్యులు)
పద్మావతినగర్, తిరుపతి టౌన్
Cell : 9491773455, 9032903955.

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.,Cell:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Cell : 70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505768181

**www.thraithashakam.org | Email : info@thraithashakam.org**

# ఏ మతములో ఎంత మతద్వేషము? 

మనిషికి పుట్టుకతోనే సంక్రమించునవి గుణములు. మనిషి పుట్టక ముందునుండీ అతనితో కలిసి ఏ గుణములున్నవో, అవే గుణములు మనిషి చనిపోయినప్పుడు కూడా అతనిని వదలక అతనితోనే కలిసియుండి, పుట్టుకలో కూడా అతనితోనేయుండి తర్వాత జీవితమంతా అదే మనిషితోనే ఉండును. దీనినిబట్టి మనిషి పుట్టుకలో గుణములు క్రొత్తగా తగులు కోవడములేదు గానీ, ముందునుండీయున్న గుణములే వదలక యుండునని తెలియుచున్నది. మనిషి ఎక్కడ పుట్టినా అతనితోపాటు కాలము, కర్మము, గుణములు ప్రయాణించి పోవుట వలన, కాలము ప్రకారము ఎప్పుడు చనిపోతే అప్పుడే పుట్టడము జరుగుచున్నది. కాలము జీవున్ని (మనిషిని) వదలక యుండడము వలన అతను ఎప్పుడు చనిపోతే అప్పుడే ఇంకొక చోట పుట్టవలసియున్నది. అందువలన క్షణము కూడా ఆలస్యము లేకుండా మనిషి చనిపోయిన వెంటనే మరియొక జన్మ ఎత్తవలసి వచ్చినది. మనిషి చనిపోయి వెంటనే ఇంకొకచోట శిశువుగా పుట్టుచున్నాడను విషయము చాలామంది ఆధ్యాత్మిక పరిచయమున్న వారికే తెలియదు. అట్లే మిగతా సామాన్య మనుషులకు కాలమును అనుసరించి ప్రతి క్షణము మనిషి జీవితములోనే ఉన్నాడను విషయము తెలియదు. మనిషి మరణమున కాలములో, కర్మలో, గుణములతో జీవుడు బంధింపబడి ఆత్మవెంట వేరే జన్మకు పోవుచున్నాడను విషయము ఇతరులకు తెలిసినా, తెలియకున్నా జరుగుచున్న సత్యము అంతేనని ప్రతి ఒక్కరూ తెలియవలెను. జీవుడు శరీరములో గుణముల మధ్యలో నివసించుచున్నా కాల, కర్మ ఆధీనములోనే యున్నాడు. కాలము ఒక క్షణము కూడా ఆలస్యము లేకుండా వేరే శిశు వు శరీరములో కొనసాగునట్లు చేయుచుండగా, కర్మ ఎడతెరపిలేకుండా అనుభవమునకు వస్తున్నది. మనిషి చేసుకొన్న కర్మను అనుసరించి రెండవ జన్మలోని జీవితము ఎలా సాగవలెనో నిర్ణయింపబడుచున్నది.

ముసలివాడుగా చనిపోయినవాడు తిరిగి శిశువుగా రూపము మారి పుట్టుచున్నాడను విషయమును చాలామంది గ్రహించలేక మనిషికి రెండవ జన్మేలేదు అని అంటున్నారు. భగవద్గీతలోగానీ మిగతా రెండు దైవగ్రంథములలోగానీ జన్మలున్నాయని చెప్పియున్నా, ఆ మాటను గ్రహించలేని కొందరు జన్మలు లేవు అంటున్నారు. భగవద్గీతలో మాటను ధృవీకరిస్తున్న అంతిమ దైవ గ్రంథములోని ఒక వాక్యమును చూస్తాము **(36-68) "మేము వృద్ధాప్యానికి చేరిన వారిని మళ్ళీ జనన స్థితికి తీసుకుపోతాము. అయినా వాళ్ళు అర్థము చేసుకోరేమిటి?"** అని ఉన్న ఆయత్‌ను చూస్తే వృద్ధునిగా చనిపోయిన వానిని దేవుడు శిశువుగా పుట్టునట్లు చేయుచున్నాడని తెలియుచున్నది.

ముఖ్యముగా మూడు మతములు భూమిమీద గలవు. అయితే అందులో ఒక మతము పునర్జన్మలున్నాయని చెప్పుచూ పునర్జన్మలను సమర్థించుచుండగా, మిగతా రెండు మతముల వారు పునర్జన్మలు 'లేవు' అని చెప్పుచున్నారు. 'ఉన్నాయి' అను పదమునకు వ్యతిరేఖ పదము 'లేవు' అనునదే! ఒకరు 'ఉన్నాయి' అంటే మరొకరు 'లేవు' అనడముతోనే మనుషుల మధ్య భేదాభిప్రాయములు ఏర్పడుచున్నవి. మనిషి నిత్యము పుట్టుచున్నాడు మరియు చస్తున్నాడు, దైవగ్రంథములు మూడు మనిషికి పునరపి జననము, పునరపి మరణము కలవని చెప్పుచున్నవి. దానిప్రకారమే మనిషి చస్తున్నాడు తిరిగి పుట్టుచున్నాడని హిందువులు చెప్పుచుండగా, మిగతా రెండు మతములవారు మనిషి ఒకేమారు పుట్టి, ఒకేమారు చనిపోవుచున్నాడు. తిరిగి పుట్టడము చావడము అంటూ లేదు అని అంటున్నారు. జనన మరణములున్నాయి అనువారు శాస్త్రమును చూపకుండా, శాస్త్రమును మరచిపోయి మొండిగా పునర్జన్మలున్నాయి అనుచుండగా, మిగతా

మతములవారు శాస్త్రాధారమును చూపకుండా, శాస్త్రప్రమాణము లేని మాటను మొండిగా మాట్లాడుచున్నారు. ఇలా 'జననము' అను విషయములో భేదాభిప్రాయములు మనుషుల మధ్య మొదలుకాగా, మిగతా కొన్ని విషయములలోనికి కూడా భేదములు ప్రాకినవి.

పునర్జన్మలతో మొదలయిన వాదమును ఎవరంతకు వారు చెప్పుచూ మా మాట సత్యమని ఒకరంటే, కాదు మా మాటే సత్యమని ఇతరులు అంటున్నారు. పునర్జన్మలున్నాయని చెప్పువారు భగవద్గీతలో జ్ఞానయోగమను అధ్యాయమున **"భగవంతుడు భూమిమీద ధర్మములకు ఎప్పుడు ముప్పు ఏర్పడుచున్నదో, అధర్మములు ఎప్పుడు చెలరేగి పోవుచున్నాయో అప్పుడు నేను అవతరించి ధర్మసంస్థాపన చేస్తానని"** చెప్పినమాటను గుర్తు చేయుచూ, ***"ఈ విధముగా దేవుడు కూడా పుట్టుచున్నాడు. దేవుడే జన్మ తీసుకొని మనిషిగా పుట్టుచున్నప్పుడు, కర్మప్రకారము మనిషి ఎందుకు పుట్టడు?"*** అని చెప్పుచున్నారు. మనిషి పుట్టుకనే ఒప్పుకోని ఇతర సమాజముల వారు దేవుడే పుట్టుచున్నాడను మాటను పూర్తి ఒప్పుకోవడము లేదు. పైగా దేవుడు పుట్టడనీ, దేవుడు పుట్టువాడే కాదని గట్టిగా చెప్పుచున్నారు. మనిషి జన్మ విషయముగానీ, దేవుని జన్మ విషయముగానీ, దైవగ్రంథములలో బ్రహ్మవిద్యా శాస్త్రమును అనుసరించి చెప్పియుండగా, మనుషులు శాస్త్ర ఆధారమును చూడకుండా తమకంటే ముందు చెప్పిన వారి మాటలనే విని, ఆ మాటలనే విశ్వసించిన వారై దేవుడు పుట్టనే పుట్టడు అంటున్నారు.

ఒక నాణెమునకు రెండువైపులా బొమ్మ బొరుసు ఉన్నట్లు, ప్రతి విషయములోనూ రెండు వైపులా సత్యాసత్యములుండును. నాణెమునకు ఒకవైపు బొమ్మవుంటే మరొకవైపు బొరుసు ఉండును. ఒక ఆకారమున్న దానిని బొమ్మ అంటాము. ఆకారము లేనిదానిని బొరుసు అంటాము.

అలాగే ఒక విషయమునకు ఒకవైపు సత్యముండును, మరొకవైపు సత్యము కానిది అసత్యముండును. ఇప్పుడు 'పునర్జన్మ' అను ఒక విషయమును తీసుకొని చూస్తే ఒకవైపు వారు 'ఉంది' అని చెప్పవచ్చును, మరొకవైపు వారు 'లేదు' అని కూడా చెప్పవచ్చును. ఒక నాణెమునకు ఒకవైపు బొమ్మ మరొకవైపు బొరుసు ఉన్నట్లు, 'పునర్జన్మ' అను విషయమునకు సత్యము అసత్యము రెండు ఉండును. నాణెమునకు ఒక ఆకారమున్న దానినే బొమ్మ అన్నట్లు, ఒక విషయమునకు శాస్త్రాధారమున్న దానినే సత్యము అంటున్నాము. శాస్త్రాధారము లేనిదానిని అసత్యము అంటున్నాము. ఈ విధముగా ప్రతి విషయమునకు శాస్త్రాధారమునుబట్టి సత్యాసత్యములు నిర్ణయించబడును. పునర్జన్మ విషయమునకు వస్తే బ్రహ్మవిద్యా శాస్త్రమును బట్టి అది సత్యమో కాదో తెలియగలదు. అయితే కొందరికి శాస్త్రమంటే ఏమిటో తెలియనప్పుడు వారు శాస్త్రము వద్దకు పోరు. శాస్త్రాధారముతో చూడరు. అటువంటివారికి శాస్త్రము అనునది సత్యాసత్యములను తేల్చి చూపు భూతద్దములాంటిదని తెలియదు. వారు తమకంటే ముందు మనుషులు చెప్పినమాటనే చెప్పుచూ, శాస్త్రమును ఏమాత్రము చూడక గ్రుడ్డిగా అసత్యమునే చెప్పుచుందురు.

పునర్జన్మల విషయమును గురించిన సత్యము బ్రహ్మవిద్యా శాస్త్రములో ఉన్నది. అదే విధముగా ప్రపంచములోని అన్ని విషయములు ఆరు శాస్త్రములకు సంబంధించియున్నవి. ఆరు శాస్త్రములు ప్రతి విషయములోని సత్యాసత్యములను తెలియజేయుచున్నవి. ఒక మనిషికి చదువురానప్పుడు, శాస్త్రమంటే ఏమిటో తెలియనప్పుడు, అతడు ఇతరులు చెప్పు మాటల మీదనే ఆధారపడవలసి వచ్చును. అప్పుడు ఆ వ్యక్తి చెప్పిన వానినిబట్టి, వినిన మాటలనుబట్టి ఏ విషయమునయినా నమ్మునుగానీ,

అతనికి శాస్త్రమంటూ ఒకటున్నదనీ, అది సత్యాసత్యములను తేల్చి చెప్పునదని తెలియదు. ఇప్పుడు ఒకచోట జరిగిన సంఘటనను వివరించు కొని చెప్పుకొందాము. ఒక పదిమంది చదువురానివారు, శాస్త్ర విషయము తెలియనివారు చదువు వచ్చిన ఒక వ్యక్తి దగ్గరకు పోయి తమ సంశయములకు పరిష్కారము తెలుసుకోవాలనుకొన్నారు. పదిమంది ఆశ్రయించిన వ్యక్తిని బోధించువానిగా, గురువుగా, మార్గదర్శకునిగా చెప్పు కొనెడివారు. ఆయన ఏమి చెప్పితే దానినే సత్యమని విశ్వసించెడివారు. పదిమందికి బోధ చెప్పు వ్యక్తి కూడా శాస్త్రమునే ఆధారము చేసుకొని, ప్రతి విషయములోనూ సత్యమునే చెప్పుచుండెను. పదిమందికి ప్రతి విషయమును చెప్పు బోధకుడు మాత్రము ఎంతో నిజాయితీ కలవాడై తాను చెప్పు బోధమీద పదిమంది ఆధారపడి సత్యాసత్యములు తెలుసుకొను చున్నారని, ఎంతో బాధ్యతగా శాస్త్రమును అనుసరించి సత్యమునే చెప్పు చుండెను. వినేవారి ఉద్దేశ్యము మంచిదే, వారు సత్యమును తెలియాలను ఉద్దేశ్యముతోనే ఒక మంచి వ్యక్తిని, శాస్త్రమును తెలిసిన వ్యక్తిని ఆశ్రయించారు. వారికి తెలియజేయు వ్యక్తి కూడా నీతి, నిజాయితీ కలవాడై ఎంతో ఉత్తముడుగా ఉండెను.

బోధ చెప్పువాడు సత్యమును చెప్పినా అసత్యమును చెప్పినా వినేవాడు దానిని రెండు మార్గముల ద్వారా గ్రహించుచున్నాడు. చెప్పేవాడు సత్యమునే చెప్పుచున్నప్పటికీ అది మనిషిలోని బుద్ధికి చేరాలంటే ఒకటి చూపు ద్వారా, రెండు వినికిడి ద్వారా చేరవలసియున్నది. చూపు కన్ను ద్వారా కలుగుచున్నది. వినికిడి చెవుద్వారా కల్గుచున్నది. ఆరోగ్యమైన కంటికి దృష్టి లోపము ఉండదు. అలాగే ఆరోగ్యమైన చెవుకు వినికిడి లోపమయిన చెవుడు ఉండదు. కన్ను తాను చూచిన దృశ్యమును చూచినట్లే

చూపుద్వారా అందించినా, అలాగే చెవి తాను వినిన శబ్దమును విన్నది విన్నట్లే వినికిడి ద్వారా లోపలికి అందించినా, దానిని మనస్సు తీసుకొని లోపల తలలోయున్న బుద్ధికి అందించవలసియున్నది. బయట బోధకుడు సరిగా సత్యమునే చెప్పినా, చెవి వినిన దానినే లోపలికి అందించినా, మనస్సు సక్రమముగా పని చేయకపోతే బయటినుండి వచ్చిన విషయము పూర్తిగా బుద్ధికి చేరడము జరుగదు. అప్పుడు వినిన విషయము, గురువు చెప్పిన విషయము శిష్యునికి తెలియకుండా పోవడమునకు అవకాశము గలదు. అట్లే బయట కన్నుద్వారా తెలిసిన దృశ్యరూపమైన విషయమును మనస్సు సరిగా గ్రహించి తీసుకుపోయి లోపల గల బుద్ధికి అందివ్వకపోతే గురువు చూపినది, తాను చూచినది బుద్ధికి తెలియకుండా పోవును. అట్లే పూర్తిగా మనస్సుకు తెలియకుండా పోవును. ప్రతి మనిషిలోనూ కన్ను చూపిన చూపును, చెవి వినిన వినికిడిని కన్ను, చెవి లోపలికి అందివ్వగా, చెవివరకు, కన్నువరకు వ్యాపించియున్న మనస్సు చెవి, కన్ను అందించిన విషయమును స్వీకరించి దానిని మోసుకొని తలలో గల గుణచక్రములోని జీవుని వరకు పోయి, అక్కడ జీవుని చుట్టూ పొరగాయున్న బుద్ధికి అందివ్వవలసియున్నది. ఆ విధముగా మనస్సు బయటి జ్ఞానేంద్రియము లయిన కన్ను, చెవి అందించిన విషయములను తీసుకొని జీవుని ప్రక్కనేయున్న బుద్ధికి చేర్చవలసి యున్నది. గురువునుండి బయటికి వచ్చిన విషయము బయట చెవి, కన్ను ద్వారా శరీరములో అంతటా వ్యాపించియున్న మనస్సుకు అందించుచున్నది. మెలుకువలో మనస్సు శరీరమంతా వ్యాపించియుండుట వలన కన్ను, చెవు వరకు వ్యాపించిన మనస్సు వినికిడిని, దృశ్యమును తీసుకొని, బుద్ధి వరకు మనస్సు వ్యాపించియుండుట వలన ఆలస్యము లేకుండా వెంటనే బుద్ధికి అందించుచున్నది. విషయయు బుద్ధికి మనస్సు ద్వారా అందినపుడు ఆ విషయము అక్కడేయున్న జీవునికి

చేరినట్లయినది. అప్పుడు ఆ విషయము ఫలానా అని జీవుడు తెలియడమేకాక ఆ విషయములోయున్న సుఖదుఃఖ అనుభవమును జీవుడు పొందుచున్నాడు. శరీరములోని 24 భాగములలో 23 భాగములకు పరిమిత స్థానములుండగా, ఒక్క మనస్సుకు మాత్రము పరిమిత స్థానము లేదు. మనస్సు శరీరమంతయూ నఖ శిఖ పర్యంతము వ్యాపించియున్నది. అలా మెలుకువలో మాత్రము శరీరమంతా వ్యాపించియున్న మనస్సు నిద్రలో బ్రహ్మనాడిలో పై భాగమున చేరిపోవుచున్నది. మనస్సు శరీరమంతా మెలుకువలో ఉన్నప్పుడు బయటి అవయవములయిన జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములకు లోపలి అవయవములయిన బుద్ధి, చిత్తము, అహముకు మధ్యవర్తిగా పని చేయుచున్నది. బుద్ధి, చిత్తము, అహము అను మూడు పొరలు శూన్యముగాయున్న జీవుని చుట్టూయుండుట వలన మనస్సు ద్వారా వచ్చిన విషయము అహమునకు తెలిసిన వెంటనే దాని ప్రక్కనేయున్న చిత్తమునకు తెలియుచున్నది. చిత్తమునకు తెలిసిన వెంటనే దాని ప్రక్కనేయున్న బుద్ధికి తెలియుచున్నది. బుద్ధికి తెలిసిన వెంటనే బుద్ధికి అంటుకొనియున్న జీవునికి తెలియుచున్నది. శరీరములోపల ఎవరికీ కనిపించని జీవుడు మరియు నాలుగు అంతఃకరణములు ఎలా ఉన్నది ప్రక్కపేజీలోని పటములో చూడవచ్చును.

బయట బోధకుడు లేక గురువు బోధించిన విషయము మనిషిలోని బుద్ధికి చేరు లోపల బయటి అవయవములవద్దగానీ, మనస్సువద్దగానీ తప్పుదారి పట్టు అవకాశము గలదు. బోధించినది బాహ్య అవయవములకు చెప్పిన విషయము సరిగా చేరకున్నా, ఒకవేళ సరిగా చేరినా మనస్సు గ్రహించుకోవడములో పొరపాటుపడినా, చివరకు బుద్ధి గ్రహించు కోవడములో తప్పు జరిగినా గురువు చెప్పిన విషయము బుద్ధికి సరిగా




చేరనట్లగును. ఒకవేళ బోధించిన బోధకుడు శాస్త్రబద్ధత లేని బోధ చెప్పియున్నా మొదటికే మోసమన్నట్లు సత్యమైన విషయమే మనిషికి తెలియకుండ పోయినట్లగును. గురువు ద్వారా వినే మనుషులు గురువునుండి శాస్త్రబద్ధ బోధ వినినా అది మనస్సు, బుద్ధి సక్రమముగా స్వీకరించినప్పుడే జీవుని వరకు సరియైన భావముతో చేరినట్లగును. ప్రతి విషయములోనూ సత్యాసత్యములు గలవు. అయితే గురువు లేక బోధకుడు శాస్త్రమును అనుసరించి సత్యమునే బోధించినా, అది మనోగ్రాహితము వద్దగానీ, బుద్ధి గ్రాహితము వద్దగానీ, తప్పు భావములోనికి పోవు అవకాశము గలదు.

ఒక విషయము ఒక మనిషి నుండి మరియొక మనిషికి సక్రమముగా చెప్పినది చెప్పినట్లు చేరవచ్చును లేక చెప్పినది చెప్పినట్లు కాక వేరు విధ భావముగా కూడా చేరవచ్చును. పదిమంది ఒకచోట చేరి ఒక గురువును ఆశ్రయించి అతని ద్వారా తమకు తెలియని కొన్ని విషయములను తెలుసుకొనుచుండిరి. అయితే ఆ గురువు శాస్త్రబద్ధమైన విషయములనే చెప్పక కొన్ని శాస్త్రమునకు సంబంధములేని విషయములను కూడా చెప్పు

చుండెను. అందులో కొన్ని అశాస్త్రీయ విషయములైనందున అవి సత్యము కానివై అసత్య విషయములై ఉండెను. వినేవారికి ఏది సత్యమో, ఏది అసత్యమో తెలియదు కనుక వారు అన్నీ సత్యమనే భావముతోనే వినుచుండిరి. ఇది ఇలా ఉండగా మరియొక పదిహేనుమంది ఒక గుంపుగా ఏర్పడి వారు కూడా ఒక బోధకున్ని చూచుకొని అతని ద్వారా తమకు తెలియని విషయములను తెలుసుకోవాలనుకొన్నారు. వారు అనుకొన్నట్లే ఒక గురువును ఎన్నుకొని అతని ద్వారా బోధలను వినుటకు ప్రారంభించారు. పదిహేను మందికి చెప్పు గురువు తన బోధలన్నిటిని శాస్త్రమునకు సంబంధించిన విషయములనే చెప్పుచుండెను. అట్లు శాస్త్రబద్ధ విషయములను చెప్పడము వలన వారికి తెలిసే విషయములన్నియూ సత్యముతో కూడుకొన్న విషయములే అయివుండెను. ఇట్లు పదిమంది ఒకగుంపు, పదిహేనుమంది ఒక గుంపుగా వేరువేరు బోధకులను ఆశ్రయించి తమకు తెలియని విషయములను తెలియుచుండిరి. వీరు ఇట్లుండగా మరియొక ఐదుమంది చదువు వచ్చినవారు ఒక గుంపుగా ఏర్పడి తామే స్వయముగా గ్రంథములలో ఉన్న విషయములను చదివి తెలుసుకొను చుండిరి. ఈ విధముగా మూడు గుంపులుగాయున్న మనుషులు తమకు తెలియని విషయములను తెలియుచుండిరి. రెండు గుంపులు ఇతర బోధకులు చెప్పు బోధలను వినుచుండగా, ఐదుమంది గుంపు గలవారు తామే స్వయముగా గ్రంథములలోని విషయములను గ్రహించుచుండిరి. ఈ విధమైన మూడు గుంపులలో మొదటిదయిన పదిమంది గుంపు ఎక్కువగా శాస్త్రమునకు సంబంధములేని విషయములనే వినుచుండిరి. అందువలన వారికి ఎక్కువగా అసత్య విషయములే తెలిసేవి. పదిహేనుమంది గల మధ్య గుంపులోని మనుషులు ఎక్కువ శాస్త్ర విషయములు తెలియుచున్నా ఎక్కడయినా వాటి మధ్యలో ఒకటి, రెండు శాస్త్రముకాని అసత్య విషయములు

కూడా తెలిసెడివారు. మూడవ గుంపయిన ఐదుమంది తామే స్వయముగా శాస్త్రములనే చదువుట వలన, వాటిని సక్రమముగా అర్థము చేసుకోవడము వలన వారికి దాదాపు అన్నీ సత్య విషయములే తెలిసెడివి.

మొదటి పదిమంది గుంపు యున్నవారి గురువు భగవద్గీతలోని జ్ఞాన యోగమునందు గల 13వ శ్లోకమును తీసుకొని దానికి వివరమును చెప్పుచూ "యుగ పురుషుని ముఖములో పుట్టినవారు బ్రాహ్మణులు, బాహువులయందు పుట్టినవారు క్షత్రియులు, ఉరువులయందు (తొడల యందు) పుట్టినవారు వైశ్యులు, పాదములయందు పుట్టినవారు శూద్రులు" అని అన్నాడు. దేవుడు శ్లోకములో **"చాతుర్వర్ణము"** అని చెప్పడము వలన నాలుగు రకముల కులముల వారిని పుట్టించాడని చెప్పవచ్చును. వర్ణము అనగా రంగు, కులము, జాతి, వేరుగా కనిపించునది అని వివిధ అర్థములను తీసుకొని చూస్తే మనుషులలో ముఖ్యముగా నాలుగు కులములు కనిపించుచున్నమాట అందరికీ తెలుసు. **"గుణకర్మ విభాగశః"** అన్నారు కాబట్టి ఈ నాలుగు కులముల వారికి నాలుగు పనులు ఉన్నవని చెప్పవచ్చును. "బ్రాహ్మణులు మిగతా మూడు కులములవారికి పెద్దగా యుంటూ బ్రాహ్మణత్వము చేయడము, పురోహితము (పౌరోహిత్యము) చేయడము పనిగా పెట్టు కోవడము, క్షత్రియులు రాజ్యమును పాలించడమూ, వైశ్యులు వ్యాపారము చేయడము, శూద్రులు తమకంటే ముందు పుట్టిన మూడు కులములవారికి సేవ చేయడము పనిగా పెట్టుకోవలెను. ఈ విధముగా నాలుగు కులములకు నాలుగు పనులు స్వధర్మములుగా యున్నవి" అని చెప్పారు.

పదిమంది గుంపు గల వారి గురువు పైవిషయమును చెప్పగా అది అన్ని విధములా శాస్త్రమునకు సంబంధములేకుండా ఉండెను. కొన్ని

రోజుల తర్వాత అదే విషయమునే పదిహేనుమంది గుంపుగలవారికి వారి గురువు అదే శ్లోకమును గురించి శాస్త్రబద్ధముగానే చెప్పెను. అయితే అందులో కొందరికి అశాస్త్రబద్ధమైన సమాచారమే తెలిసినది. అది ఏ విధముగా జరిగిందో వివరించుకొందాము. గురువుగారు చెప్పిన వివరములో నాలుగు వర్ణములను నాలుగు జాతులని చెప్పినప్పుడు వినేవారి బుద్ధికి మనుషుల శరీరముల పుట్టుకనుబట్టి నాలుగు జాతులుగా ఉన్నారని అర్థమయినది. శ్లోకములో **"చాతుర్వర్ణ్యం గుణకర్మ విభాగశః"** అని ఉండుట వలన నాలుగు రకముల జాతుల పేర్లు శ్లోకములో లేవు. **"గుణ కర్మలనుబట్టి నాలుగు రకముల మనుషులను సృష్టించాను"** అనుమాటలో గుణ కర్మలను మాటను పూర్తిగా వదలివేసినవారు, నాలుగు రకముల జాతులనే జ్ఞాపకముంచుకొన్నారు. శ్లోకములో కొద్దిపాటి సూత్రమును చెప్పారు. అంతేగానీ ఆ నాలుగు వర్ణముల పేర్లు అక్కడ చెప్పలేదు. అందువలన శ్లోకమును విన్నవారే ఆ వర్ణములను గురించి అర్థము చేసుకోవలసియున్నది. లేకపోతే శ్లోకమును వివరించి చెప్పువారయినా, నాలుగు వర్ణములను గురించి చెప్పవలసియున్నది. అయితే గురువుగారు శ్లోకములో ఎంతవుందో అంతవరకే చెప్పి వదలివేశారు. ఆ విషయమును వినిన గుంపులో కొందరు వారి బుద్ధికి, మనుషుల శరీరముల పుట్టుకలను బట్టి లేక శరీర ఆకారములను బట్టి నాలుగు రకములుగా చెప్పుకోవచ్చుననీ, ఆ నాలుగు రకముల వారిలో ఒకటి నల్లని నీగ్రోజాతి మనుషులనీ, రెండవ రకమువారు పొట్టిగాయున్న చైనా, జపాన్ మనుషులనీ, మూడవ జాతివారు తెల్లగా పొడవుగా కోల ముఖముగాయున్న అమెరికా, ఇంగ్లాండ్ దేశముల వారు, నాలుగవ జాతివారుగా పొట్టి, పొడవు, నలుపు, తెలుపు అన్నీ కలిపియున్న భారత దేశమువారని, నాలుగు రకముల ప్రజలను చెప్పుకోవడము జరిగినది. వారిలో ఐదుమంది మనుషుల శరీరముల

ఆకృతినిబట్టి నాలుగు రకముల మనుషులని వారి బుద్ధికి అర్థము చేసుకోగా, అదే గుంపులో మిగతా పదిమంది బుద్ధికి మరొక రకముగా అర్థమయినది. వారికర్థమయిన దానినిబట్టి ప్రపంచ విషయములో నీతి యున్నవారు, నీతి లేనివారు, పరమాత్మ విషయములో జ్ఞానులు, అజ్ఞానులని నాలుగు రకముల మనుషులున్నారని అనుకోవడము జరిగినది.

ఇక మూడవ గుంపువారయిన ఐదుమంది స్వయముగా దైవ గ్రంథములను చదువుచూ మనుషుల మాటలకు దూరముగాయుండి, దైవగ్రంథములో చెప్పిన దానిని సమూలాగ్రముగా అర్థము చేసుకొనెడివారు. ఎక్కడయినా సంశయమున్నట్లయితే గురువుననిగానీ, బోధకుడననిగానీ చెప్పుకోని ఒక మేథావిని అడిగి తెలుసుకొనెడివారు. ఆ మేథావి మతములకు అతీతముగా యున్నవాడై శాస్త్రబద్ధమైన వివరమునే చెప్పుచుండెను. మతములకు అతీతముగా యున్న మూడవ గుంపువారు మూడు మత గ్రంథములను సమానముగా చూస్తూ, వాటిలోని భావమును శాస్త్రయుతముగా అర్థము చేసుకొనెడివారు. భగవద్గీతలోని జ్ఞానయోగము 13వ శ్లోకమందుగల నాల్గు వర్ణములను గుర్తించడములో, అదే శ్లోకములో చెప్పిన గుణకర్మములను ఆధారము చేసుకొని, జీవుడు చేయు పనులనుబట్టి అతడున్న గుణములనుబట్టి జీవుళ్ళను **తామసులు, రాజసులు, సాత్త్వికులు, యోగులు** అని నాల్గురకములుగా విభజించుకొన్నారు. మూడు గుంపులలో పదిమంది గల మొదటిగుంపు నాలుగు కులముల మనుషులను బ్రాహ్మణులు, వైశ్యులు, క్షత్రియులు, శూద్రులు అని బయట మనుషుల కులములను చెప్పుకోగా, రెండవ గుంపులోని పదిహేనుమందిలో కొందరికి బయట శరీర పోలికలనుబట్టి నల్లజాతి, తెల్లజాతి, పొట్టిజాతి, మిశ్రమజాతి శరీరముల వారని నాలుగు రకముల మనుషులుగా గుర్తించారు. తర్వాత

మూడవ గుంపులోని ఐదుమంది శరీరము లోపలయున్న గుణములనుబట్టి శరీరములోపల నివసించు జీవులను నాలుగు రకములు విభజించి తామసులు, రాజసులు, సాత్త్వికులు, యోగులు అను నాలుగు రకములుగా చెప్పారు. ఈ మూడు గుంపులవారు మూడు విధములుగా చెప్పడమేకాక ఎవడు చెప్పిన దానిని వారు గట్టిగా సమర్థించి చెప్పుచున్నారు. భగవద్గీతలో చెప్పినది ఒకే విషయమే! అయితే అది మనుషుల వద్దకు చేరేటప్పటికి మూడు విధములుగా మారిపోయినది. భగవద్గీతలో చెప్పినవాడు ఒక్కడే, చెప్పబడిన విషయము ఒక్కటే అయినప్పుడు మనుషులు అర్థము చేసుకొన్నది నాలుగు రకములు. ఒకే సమాచారము నాలుగు విధముల ఎందుకు అర్థమయినదో యోచించితే చెప్పెడి బోధకుడి వద్దయినా భావము మారియుండవచ్చును. వినెడి చెవుకు సరిగా వినిపించకపోయి వుండ వచ్చును. మూడవది బయటి నుండి లోపలికి గ్రహించు మనస్సు గ్రహించు కోవడములోనయినా తేడా యుండవచ్చును. చివరకు మనస్సు అందించిన దానిని బుద్ధి గ్రహించుకోవడములోనయినా తేడా అయివుండవచ్చును.

ఒక సమాచారము శరీరములో బుద్ధి వరకు చేరులోపల నాలుగు చోట్ల భావము మారిపోవు అవకాశము గలదు. చూడగా భగవద్గీతలోని ఒక శ్లోకములోయున్న ఒక భావము మూడు గుంపుల మనుషులవద్దకు చేరులోపల నాలుగు విధముల భావములుగా మారిపోయినది. ఒకే గుంపులోని కొందరికి ఒక రకముగా, మరికొందరికి మరొక రకముగా అర్థమయినది. ఒకే మతములో యున్నవారికి వారి మతమునకే అని చెప్పబడుచున్న ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో ఒక శ్లోకములో ఒకే మతమువారయిన హిందువులలోనే ఇన్ని భేదాభిప్రాయములుండగా మిగతా భగవద్గీత దాదాపు ఏడువందల శ్లోకములు అందరికీ సక్రమముగా

సరియైన అర్థములో తెలిసియుండునను నమ్మకములేదు. ఒక శ్లోకములోనే నాల్గురకముల భేదాభిప్రాయములున్నప్పుడు మనుషులకు మిగతా భగవద్గీత యంతయూ ఒకే విధముగా అర్థమయివుంటుందని చెప్పుటకు వీలులేదు. ఒకే మతములోనే భేదాభిప్రాయములున్నపుడు మిగతా దైవ గ్రంథములలోని ఒకే విషయము మీద ఒక్కొక్క మతము ఒక్కొక్క అభిప్రాయము కల్గియుండడములో ఆశ్చర్యములేదు. భగవద్గీతలోని శ్లోకములో ఒకే భావమున్నట్లు మిగతా రెండు దైవగ్రంథములయిన బైబిలు, ఖురాన్ గ్రంథములలో భగవద్గీతలోని ఒకే జ్ఞానమే ఇమిడియున్నది. చావుపుట్టుకల గురించి భగవద్గీతలో చెప్పిన విషయమే మిగతా దైవగ్రంథము లలో కూడా కలదు. భగవద్గీతలో చెప్పిన ముగ్గురు పురుషుల విషయమే మిగతా బైబిలు, ఖురాన్ గ్రంథములలో కూడా కలదు. ఈ విధముగా ఒకే విషయము మూడుగ్రంథములలో ఒకే భావముతోయున్నది, అయినా మనుషులు ఆ విషయమును తెలియలేక పోయారు.

సృష్ట్యాదిలో దేవుడు మానవుల కొరకు దైవజ్ఞానమును శబ్ద రూపముగా అందించాడు. దానినే వాణి (వహీ) అని అన్నారు. మొదట గ్రంథరూపములో లేని దైవజ్ఞానము శబ్దరూపముగా వచ్చియుండి **“జపర”** అను పేరు కల్గియుండెడిది. “జపర” అనగా పుట్టిన దానికంటే వేరుగా యున్నదని అర్థము. అంటే ప్రకృతికంటే వేరయినదని అర్థము. అలా జపరగాయున్న జ్ఞానము మొదట దాదాపు ఐదువేల సంవత్సరముల పూర్వము భారతదేశములో **“భగవద్గీత”**యను గ్రంథరూపమైనది. అదియే పడమటి దేశములలో **“తౌరాత్”** గ్రంథముగా వ్రాయబడినది. భగవద్గీత అనినా తౌరాత్ అనినా రెండూ ఒకే గ్రంథముగా లెక్కించవలెను. కొంత కాలమునకు భగవద్గీత లేక తౌరాత్ గ్రంథములోని జ్ఞానమే మిగత రెండు

గ్రంథములుగా మారిపోయినది. మొదటి గ్రంథము భగవద్గీత లేక తౌరాత్ అలాగేయుండగా, దానిలోని జ్ఞానముయే ఇంజీలు, ఖురాన్ గ్రంథములుగా మారిపోయినది. ఇంజీలు, ఖురాన్ గ్రంథముల జ్ఞానము తౌరాత్ గ్రంథములోని జ్ఞానమును ధృవీకరిస్తున్నదని ఖురాన్ గ్రంథములో ఐదవ సూరాలో చాలాచోట్ల చెప్పబడినది. దీనినిబట్టి భగవద్గీతలోని ఒక్క జ్ఞానమే మిగతా రెండు గ్రంథములలో కలదని తెలిసిపోయినది. నేడు భగవద్గీత, బైబిలు, ఖురాన్ గ్రంథములు మూడు, మూడు మతగ్రంథములుగా ప్రజలు చెప్పుకొంటున్నా మూడిటియందు ఒకే జ్ఞానమున్నదని, ఒకే దేవున్ని గురించి చెప్పినదని చెప్పుకోలేక పోవుచున్నారు. పైగా మా గ్రంథము వేరు, మా జ్ఞానము వేరు, మా దేవుడు వేరు అంటున్నారు. మూడు గ్రంథములలో యున్న ఒకే విషయము మీద ఒక్కొక్క మతమువారు, ఒక్కొక్క అభిప్రాయము కల్గియుండుట వలన మతము, మతమునకు మధ్య భేదము పుట్టుకొస్తున్నది. అట్లే మనిషి మతమును అవలంభించుటచేత, ఒక మతము వారు ఏమి చెప్పితే ఆ మతములోని మిగతావారందరూ అదేమాటను మాట్లాడు చున్నారు. అట్లు మాట్లాడుట వలన మతముల మధ్య సామరస్యము పోయి భేదాభిప్రాయములుకల్గి, చివరకు భేదములు అసూయగా మారుచున్నవి. అప్పుడే మతమునకు, మతమునకు మధ్య మతద్వేషము ఏర్పడుచున్నది. మతద్వేషములు చిన్నగా మొదలయి చివరకు అది పెద్దగా యుద్ధముల వరకు దారితీస్తున్నది. ద్వేషము పెరిగిపోయి శత్రుత్వముగా మారిపోవడము వలన ఒకరికొకరు దాడులు చేసుకొని హింసించుకొనుట జరుగుచున్నది.

మతద్వేషము లేకుండా పోవాలంటే ఒకరికర్థమయిన విషయమే ఇంకొకరికీ అర్థము కావాలి. అర్థమయిన విషయము ఎప్పటికీ అసత్యము కాకుండా ఉండాలంటే, అది శాస్త్రబద్ధమైన విషయమై ఉండాలి. శాస్త్రము

అనగా! శాసనముతో కూడుకొన్న సత్యమై ఉండునదని అర్థము. ఒకేమాటలో చెప్పాలంటే ఏది సత్యమో అదే శాస్త్రము, ఏది శాస్త్రమో అదే సత్యము. భగవద్గీతలోని ప్రతి విషయము శాస్త్రముతో కూడుకొన్న దానినే భగవంతుడు చెప్పడము జరిగినది. మాటలరూపములో చెప్పబడిన భగవద్గీత వ్రాత రూపములోనికి వచ్చినప్పుడు, కొంత భావము మారిపోయి దేవుడు చెప్పని విషయములు కూడా గ్రంథములో వ్రాయబడినాయి. మొదట గ్రంథమును వ్యాసుడు వ్రాసినప్పుడు అందులోనికి స్వచ్ఛమయిన సమాచారమే వ్రాయబడినప్పటికీ, వ్యాసుడు పోయిన తర్వాత భగవద్గీతలో కొన్ని ప్రక్క భావములు చేర్చబడినవి. మనుషులు చెప్పిన విషయములు భగవద్గీతలో సులభముగా బయటికి కనిపించుటచేత మేము వాటిని కల్పిత శ్లోకములని చెప్పడము జరిగినది. మనుషులు వ్రాసిన విషయములలో శాస్త్రబద్ధత లేనిదానివలన అవి హేతుబద్ధముకాని విషయములుగా కనిపిస్తున్నవి. వాటి వలన మనుషులు అజ్ఞానమార్గము పట్టిపోవు అవకాశము గలదు. అందువలన మేము వ్రాసిన **"త్రైత సిద్ధాంత భగవద్గీత"** గ్రంథములో ఇవి కలుషిత శ్లోకములని చెప్పాము.

భగవద్గీతను అనుసరించి భగవద్గీత తర్వాత మూడువేల సంవత్సర ములకు ఇంజీలు గ్రంథము చెప్పబడినది మరియు వ్రాయబడినది. ఆ తర్వాత ఆరువందల సంవత్సరములకు అనగా భగవద్గీత తర్వాత 3600 సంవత్సరములకు అంతిమ దైవగ్రంథము ఖురాన్ వ్రాయబడినది. ఇప్పటికి దాదాపు 1400 సంవత్సరముల పూర్వము వ్రాయబడిన ఖురాన్ గ్రంథములోనూ, ఇంజీలు గ్రంథములోనూ భగవద్గీతలో దేవుడు చెప్పిన జ్ఞానమునే చెప్పడమైనది. అయితే భగవద్గీత కలుషిత శ్లోకములతో కూడుకొన్నట్లు, మిగతా రెండు గ్రంథములలో కూడా కొంత కల్పిత

బోధలున్నాయని తెలియుచున్నది. ఎక్కడయితే శాస్త్రసంబంధ బోధలు లేవో అక్కడ కల్పిత బోధలున్నట్లు తెలియుచున్నది. కల్పిత బోధలను అనుసరించు మనుషలు దేవుడు చెప్పిన జ్ఞానమును కాకుండా మనుషలు చెప్పిన జ్ఞానమును అర్థము చేసుకోవడము వలన, పూర్తి తప్పుదారిలో పోయి అజ్ఞాన అంధకారములో చిక్కుకోవలసి వచ్చుచున్నది. దేవుడు చెప్పిన స్వచ్ఛమయిన జ్ఞానమును, శాస్త్రబద్ధమైన జ్ఞానమును తెలియడము లోనే గ్రాహితశక్తి కరువైపోయి, వేరువేరు భావములలోనికి పోవు మనిషి కల్పిత వాక్యములలో పడితే పూర్తి అజ్ఞానమై పోవును. అందువలన మా చేతనయినంత మేరకు మేము శాస్త్రబద్ధమైన విషయములనే బయటికి తెలియచెప్పుచూ వస్తున్నాము.

భగవద్గీత అన్ని జ్ఞానములకు **"గీటురాయి"**గా ఉన్నది. గీటురాయి తో ఏది బంగారమో, ఏది బంగారు కాదో గీచి చూడగల్గినట్లు భగవద్గీత యొక్క జ్ఞానముతో మిగతా గ్రంథములలోని దైవజ్ఞానమును సులభముగా గ్రహించవచ్చును. అప్పుడు మనిషికి పనికిరాని ప్రపంచ విషయములను వదలివేయవచ్చును. శాస్త్రమును అనుసరించుట వలన జ్ఞానములో ఏది సత్యము, ఏది అసత్యము అనుమాట తెలియును. ప్రపంచ విషయములకు శాస్త్రములు ఐదు ఉండగా, దేవుని విషయమునకు బ్రహ్మవిద్యా శాస్త్రము ఒక్కటే గలదు. బ్రహ్మవిద్యా శాస్త్రమును అనుసరించి మిగతా దైవ గ్రంథములలోని విషయములను చూడవచ్చును. బ్రహ్మవిద్యా శాస్త్రమును అనుసరించియున్న విషయములన్నియూ సక్రమమైనవనీ, బ్రహ్మవిద్యా శాస్త్రమునకు సంబంధము లేకుండాయున్న విషయములన్నీ సరియైన జ్ఞానము కాదనీ తెలియవచ్చును. ఒకే విషయము మూడు గ్రంథములలో శాస్త్రబద్ధముగా చెప్పియున్నా, వాటిని మనిషియొక్క బుద్ధి గ్రహించలేనిదై

శాస్త్రబద్ధమైన దానిని కూడా శాస్త్రబద్ధముకాని విషయముగా తెలియవచ్చును. అప్పుడు ఒకే విషయములో భేదము రావడము సహజము. పునర్జన్మల విషయములో భగవద్గీతలోనూ, చివరి గ్రంథమయిన ఖురాన్‌లోనూ ఎక్కువగా చెప్పియున్నాడు. మధ్యమ దైవగ్రంథములో పునర్జన్మ విషయమున్నా దానిని ఎక్కువగా చెప్పలేదు. చివరి దైవగ్రంథములో భగవద్గీతలో చెప్పిన దానికంటే ఎక్కువగా పునర్జన్మ విషయమును గురించి చెప్పడమైనది. భగవద్గీతలో పునర్జన్మ విషయమై ఒకచోట చచ్చినవాడు పుట్టక తప్పదని చెప్పిన విషయమునే తర్వాత సూచాయగా మూడుమార్లు చెప్పడము జరిగినది. అదే పునర్జన్మ విషయమునే ఖురాన్ గ్రంథములో దాదాపు పదిహేనుమార్లు గుర్తు చేస్తూ చెప్పాడు. భగవద్గీతలో మూడుమార్లు చెప్పియుండగా, ద్వితీయ గ్రంథమయిన ఇంజీలులో సూచాయగా ఒకటి లేక రెండుసార్లు చెప్పి యుండగా, తృతీయ గ్రంథము, చివరి దైవగ్రంథమయిన ఖుర్ఆన్ గ్రంథములో దాదాపు పదిహేనుమార్లకంటే ఎక్కువే చెప్పియున్నాడు.

భూమిమీద పునర్జన్మల గురించి అత్యధికముగా చెప్పిన గ్రంథము ఖుర్ఆన్ గ్రంథమేనని చెప్పవచ్చును. అయితే ప్రజల బుద్ధికి ఆ విషయము అర్థము కాక చివరకు "పునర్జన్మలే లేవు" అంటున్నారు. ఖురాన్ గ్రంథములో మిగతా గ్రంథములకంటే ఎక్కువగా పునర్జన్మల ప్రస్తావన వచ్చియున్నా అది అంతయూ ప్రళయము తర్వాతయనో, యమలోకములోయనో, స్వర్గ లోకములోయనో అనుకొంటున్నారు. మనిషి ఎక్కడో ఉన్నాయనుకొను స్వర్గనరకములు మనము జీవించు జీవితములోనే ఉన్నాయి అని అనుకోవడము లేదు. ఎప్పుడో జరుగునను ప్రళయము జీవితము యొక్క చివరిలో మరణము వచ్చినప్పుడే శరీర ప్రళయము జరుగుచున్నదని తెలియడము లేదు. అంతిమ దైవగ్రంథములో చెప్పిన విషయములన్నియూ

మన కళ్ళ ముందరే జరుగుచున్నా, వాటిని బుద్ధి చేత గ్రహించలేనివాడై ఎవరూ ఎప్పుడూ చూడని, ఎక్కడా జరుగని విషయములను ఎక్కడో ఉన్నట్లు, ఎప్పుడో జరుగునట్లు ఊహించుకొంటున్నాడు. దానికితోడు తమకంటే పెద్దలయిన బోధకులు బోధించినది కూడా యదార్థముకానిదీ, ఊహించుకొని చెప్పినదీ అయిన దానివలన, మనిషి దేవుడు చెప్పిన జ్ఞానమును అందుకోలేక పోవుచున్నాడు. ఒకచోట ఖురాన్ గ్రంథములో 53వ సూరాలో 46, 47 ఆయత్‌లయందు వీర్యబిందువుతోనే రెండవ జన్మకలదని స్పష్టముగా చెప్పియున్నా రెండవ జన్మ లేదు, మనము ఎవరూ తిరిగి భూమిమీద తల్లి తండ్రులకు పుట్టడము లేదు అనడములో అర్థమేలేదు. పునర్జన్మల విషయము దాదాపు పదిహేనునుండి ఇరవైమార్లు ఖురాన్ గ్రంథములో చెప్పియున్నా, దానిని బుద్ధి గ్రహించకపోవడము వలన మనిషి అజ్ఞానమార్గములోనికి పోవుచున్నాడు. అదే విషయము అర్థమయి పునర్జన్మలున్నాయని చెప్పు వానితో అభిప్రాయభేదములు ఏర్పడుచున్నవి.

ప్రపంచ విషయములో ఏర్పడు అభిప్రాయభేదములు కొంత కాలమునకు లేకుండా పోవు అవకాశము గలదు. ఎందుకనగా! ప్రపంచ విషయములన్నియూ ప్రత్యక్షముగా ఉండుటవలన అందులోని సత్యాసత్యములు సులభముగా తెలియు అవకాశము కలదు. కావున ప్రపంచ విషయములలో ఒకప్పుడు అభిప్రాయ భేదములు ఏర్పడినా చివరికవి లేకుండా పోయి ఒకరికొకరు రాజీపడుటకు అవకాశము గలదు. దేవుని విషయములన్నియూ సూక్ష్మమైనవగుట వలన ఎక్కువగా బుద్ధి చేత అర్థము చేసుకోవలసి యుండును. బుద్ధికి అర్థముకాకపోతే అది ప్రత్యక్షముగా మన ఎదుట జరుగు విషయమైనా మనిషి దానిని తెలియలేడు. అందువలన దేవుని విషయములో ఎవనికర్థమయినది వాని తలలో గట్టిగా నిలబడి

యుండును. దానినే వాడు సత్యమనుకొనుచుండును. ఉదాహరణకు పునర్జన్మల విషయములో మనిషి ప్రత్యక్షముగా పుట్టుచున్నా, వానికి అర్థమయిన దానినిబట్టి మనిషికి పునర్జన్మలే లేవు అంటున్నాడు. దానిని సత్యమని నమ్మియుండుట వలన సత్యమును తెలిసినవారు చెప్పినా, చెప్పినవానిదే అసత్యము అంటున్నాడు. పునర్జన్మల విషయము ఎక్కువగా చెప్పిన గ్రంథములోని విషయమునే కాదను స్థితిలో మనిషియుండుట వలన మనిషికి దేవుని జ్ఞానము సంపూర్ణముగా అర్థము కాలేదని చెప్పవచ్చును.

ఒక పునర్జన్మల విషయములోనే కాకుండా 'దేవుడు అవతరించును' అనే విషయములో కూడా జ్ఞానుల అజ్ఞానుల మధ్యలో ఒకే అవగాహన లేదు. కొందరు దేవుడు వచ్చి భూమిమీద పుట్టుచున్నాడని చెప్పుచుండగా 'దేవుడు పుట్టనే పుట్టడు' అని కొందరంటున్నారు. భగవద్గీతను చదివిన హిందువులు భగవద్గీతలో చెప్పిన ప్రకారము దేవుడు ధర్మసంస్థాపన కొరకు వచ్చి భూమిమీద పుట్టుచున్నాడని నమ్ముచుండగా, ముస్లీమ్‌లు తమ మత ధర్మము ప్రకారము దేవుడు పుట్టడు అని చెప్పడము వలన, దేవుని పుట్టుకలో కూడా హిందువులకు ముస్లీమ్‌లకు మధ్యలో పొంతన లేకుండాపోయినదని తెలియుచున్నది. భగవద్గీతలో జ్ఞానయోగమను అధ్యాయము మొదటనే 7, 8 శ్లోకములయందు దేవుడు అవతరించి ధర్మసంస్థాపన చేయునని అధర్మములను అణచివేయునని చెప్పియున్నారు. అలా భగవద్గీతలో ఒకచోట మాత్రము చెప్పిన దేవుని అవతార విషయము ఖురాన్ గ్రంథములో 15వ సూరా 29, 30 ఆయత్‌లలోనూ, 89వ సూరా 21, 22 ఆయత్‌ల లోనూ **"దేవుడు అవతరిస్తాడు"** అని అర్థమగునట్లు చెప్పియున్నారు. అయినా ముస్లీమ్‌లు ఆ మాటను పరిగణలోనికి తీసుకోవడములేదు. భగవద్గీతలో ఒక్కమారే చెప్పిన దేవుని అవతరణ విషయము, ఖురాన్ గ్రంథములో

రెండుమార్లు చెప్పియున్నా దానిని వారు ధృవీకరించడములేదు. ఈ విధముగా దేవుని పుట్టుక విషయములో కూడా హిందువులకు ముస్లీమ్‌లకు వేరువేరు అభిప్రాయములున్నాయి, ఏకాభిప్రాయములో లేరు.

ఈ విధముగా చూస్తే మనిషి 'పునర్జన్మ' విషయములోనూ, 'దేవుడు అవతరిస్తాడు' అను విషయములోనూ ఒక విధముగా ముస్లీమ్‌లే పొరపాటు పడినారనుకొందాము. అయితే దేవుడు ఒక్కడే అందరికీ అధిపతియని భగవద్గీతలో ఎక్కువమార్లు చెప్పియున్నా, హిందువులు ఆ విషయమును గ్రహించక దేవున్ని ఒక్కనినే ఆరాధించక దేవుడుకాని దేవతలను ఎందరినో దేవునితో సమానముగా ఆరాధించుచున్నారు. "నేను తప్ప ఇతర దేవుడు లేడు" అని భగవద్గీతలో చెప్పియున్నా ఆ మాటను లెక్కచేయని హిందువులు ఇతర దేవతలను ఆరాధించుచున్నారు. 'దేవుడు ఒక్కడే' అను విషయము ఖురాన్ గ్రంథములో కూడా చెప్పబడియున్నది. ఖురాన్‌లో చెప్పిన పునర్జన్మల విషయమును, దేవుని అవతరణ విషయమును గ్రహించని ముస్లీమ్‌లు 'దేవుడు ఒక్కడే' అను విషయమును చక్కగా గ్రహించి ఒకే దేవున్ని ఆరాధించు చున్నారు. ఈ విషయములో హిందువులు వక్రమార్గము పట్టిపోగా, ముస్లీమ్‌లు వాస్తవ జ్ఞానమును ఆశ్రయించి ఒకే దేవున్ని విశ్వసించడము జరిగినది. ఈ విధానములో ముస్లీమ్‌లు విగ్రహారాధనను ఖండించగా, హిందువులు విగ్రహారాధన చేయుచున్నారు. ఈ విషయములో ముస్లీమ్‌లు ఎక్కడా దారితప్పక అన్య దేవతారాధనను ఖండించుచున్నారు. విగ్రహారాధన సనాతన ధర్మమని హిందూ బోధకులు చెప్పుచున్నారు. ఇట్లు ఈ విషయములలో హిందువులకు ముస్లీమ్‌లకు అభిప్రాయ భేదములుగలవు.

భగవద్గీతలో "మూడు ఆత్మల విషయము" చెప్పియున్నా అది హిందువులకు అర్థము కాలేదు. అలాగే ఖురాన్ గ్రంథములో "మూడు ఆత్మల విషయము"ను చెప్పియున్నా ముస్లీమ్‌లకు కూడా ఆ విషయము

అర్థము కాలేదు. ఇలా ఎన్నో విషయములు రెండు గ్రంథములందు సమానముగా చెప్పియున్నా, వాటి జోలికి ఇటు హిందువులు, అటు ముస్లీమ్‌లు పోనందున ఆ విషయములే ఇరువురకు తెలియకుండా పోయినవి. అందువలన ఆ విషయముల ప్రస్తావన ఇరువురిలో లేనందున వాటి విషయములో అభిప్రాయ భేదములు లేవు. మిగతా జ్ఞాన విషయములను అనేకముగా రెండు గ్రంథములలో చెప్పియున్నా, వాటిమీద ధ్యాస ముస్లీమ్‌లకుగానీ, హిందువులకుగానీ లేదు. 'దేవుడు ఒక్కడే' అను విషయములో ముస్లీమ్‌లు సక్రమమైన దారిలోవుంటే, హిందువులు దారితప్పి వక్రమార్గము పట్టిపోయారు. పునర్జన్మల విషయములో హిందువులు సక్రమమైన మార్గములో ఉండగా, ముస్లీమ్‌లు అపమార్గము పట్టి తప్పు దారిలోపోయారు. మిగతా దైవ విషయములు ఎన్నో పదుల సంఖ్యలో ఉండగా, 'దేవుడు ఒక్కడే' అను మాటలోనూ, 'పునర్జన్మల' విషయములోనూ హిందువులు ముస్లీమ్‌లు వేరువేరు అభిప్రాయములు కల్గియుండి, వేరు వేరు అభిప్రాయముల వలన అసూయను పొంది, అసూయ వలన శత్రుత్వమునకు దారితీయుచున్నారు. శత్రుభావము వలన అక్కడక్కడ ఒకరినొకరు హింసించుకోవడము జరుగుచున్నది. కొన్ని ఇతర దేశములలో దైవజ్ఞానము ఏమాత్రము తెలియనివారై, మూర్ఖముగా ముందుకు పోవుచూ, హింసనే ప్రధానవృత్తిగా పెట్టుకొని ఇతర మతముల మీద దాడులు చేయడము జరుగుచున్నది.

ఒకరికొకరు అర్థము చేసుకోని విషయములు రెండు మాత్రమే. భేదాభిప్రాయములు కల విషయములు కేవలము రెండు మాత్రమే! అయితే దేవుని జ్ఞానముగల తమ గ్రంథములని హిందువులు, ముస్లీమ్‌లు చెప్పుకొను రెండు దైవగ్రంథములలోనూ 98 శాతము జ్ఞాన విషయములు గలవు.

98 శాతము జ్ఞాన విషయములు తమ గ్రంథములలోయున్నా వాటిని తెలుసుకొందామను **శ్రద్ధ** రెండు మతములలో లేదు. ఇక మధ్యలోయున్న క్రైస్తవ మత విషయమునకు వస్తే వారు తమ మతము శాంతి మతమని చెప్పుకొనుచూ, ఎవరితోనూ ఘర్షణ పడకుండా తమ పనిని తాము చేసుకొనునట్లు కనిపించుచుందురు. అయితే వీరిలోనూ పరమత ద్వేషమున్నా అది లోపలయుండి బయటికి కనిపించకయుండును. వీరు ముస్లీమ్‌లు హిందువులు మాట్లాడినట్లు ప్రత్యక్షముగా ఏమీ మాట్లాడక, వారి అసూయను బయటికి కనిపించక లోపలేయుండు నట్లుందురు. హిందువులు ముస్లీమ్‌లు **"పునర్జన్మల"** విషయములోనూ, **"దేవుడు ఒక్కడే"** అను విషయములోనూ వ్యతిరేఖ భావములున్నట్లు కనిపించుచుందురు కదా! అయితే క్రైస్తవులు మాత్రము ఏ జ్ఞాన విషయములలోనూ ఎక్కడా అభిప్రాయభేదములను కనబరచరు. వారి చర్చికి వారు పోవడము, వారి ప్రార్థన వారు చేసుకోవడము జరుగుచుండును. ఈ విధముగా శాంతి స్వభావులుగా కనిపించు క్రైస్తవులు భూమిమీద అన్ని మతములకంటే అతి పెద్ద మతముగాయున్నారు. దానికి కారణము వారు మత ప్రచారమునే ఎక్కువ ప్రాధాన్యముగా పెట్టుకొన్నారు. తమ గ్రంథములోని జ్ఞానమును బయటికి చెప్పుచూ, తమ మతములో పాపక్షమాపణ కలదనీ, మిగతా మతములలో పాపక్షమాపణ లేదని చెప్పడము వలన, ఎక్కువమంది ప్రజలు క్రైస్తవుల వైపు పోవడము జరిగినది. దానితో ఆ మతము తొందరగా కొద్ది కాలములోనే అభివృద్ధి చెందుతూ వచ్చినది.

హిందూమతములో ఈ దేవతపెద్ద, ఆ దేవత మరీపెద్దయని వారి కోర్కెలను తీర్చుకొనుటకు అనేక దేవతలను పూజించుచున్నారు. ఏ దేవతకు మ్రొక్కినా అక్కడ ముఖ్యముగా వారి కోర్కెల నిమిత్తమే మ్రొక్కుచుందురు.

దేవతలలో కూడా మనిషి కోరిన కోర్కెలను తొందరగా తీర్చు దేవతల వద్దకు ఎక్కువమంది భక్తులు పోవడము జరుగుచున్నది. తిరుపతి వెంకటేశ్వరున్ని ప్రజలు ఆపద మ్రొక్కులవాడు, కోరిన కోర్కెలను నెరవేర్చు వాడు అని చెప్పుకొనుచుందురు. తిరుపతి దేవస్థానము ఎల్లకాలము కిక్కిరిసిన భక్తులతో నిండియుండును. దేశములో ఎన్నో హిందూ దేవతల గుడులున్నా, కొన్ని ఎక్కువ రద్దీగాయుండడము, కొన్ని రద్దీగా లేకుండా ఉండడము చూస్తూనే ఉన్నాము. హిందువులలో భక్తి భావములున్నా అవి అనేక దేవతల మీద ఉన్నది. అసలయిన సృష్ఠికర్త అయిన దేవుడు అను విషయము కూడా చాలామంది హిందువులకు తెలియదు. హిందువులలో తత్త్వవేత్త లయిన బహుకొద్ది మందికి తప్ప, అందరికీ పెద్ద అయిన దేవుని విషయము తెలియదు. హిందువుల దృష్ఠిలో అనేక దేవతలు తప్ప అసలయిన దేవుడు లేడు. ఈ ఒక్క విషయములోనే హిందువులకు ముస్లీమ్‌లకు ఏమాత్రము సరిపోదు.

ముస్లీమ్‌లలో కూడా పాపక్షమాపణ అనుమాట లేదు. ఒక్క క్రైస్తవు లలో తప్ప హిందువులలోగానీ, ముస్లీమ్‌లలోగానీ పాపక్షమాపణ అను మాటే వినిపించదు. ఒక్క పాపక్షమాపణ విషయమును ప్రచారము చేయడములో క్రైస్తవులు ఎక్కువ శ్రద్ధ చూపడము వలన, ప్రజలు అందరూ పాపము చేసినవారే అగుట వలన, పాపక్షమాపణ అందరికీ అవసరమైన దానివలన, చాలామంది క్రైస్తవము వైపు మొగ్గుచూపడము వలన, ఆ మతము భూమిమీద అతిపెద్ద మతముగా పెరిగిపోయినది. దేవుడు భూమిమీద ప్రజలందరికీ ఒక్కరే అయినందున పాపక్షమాపణ ఒక్క క్రైస్తవమతములోనే ఉన్నదని, మిగతా మతములలో లేదని చెప్పలేదు. మనిషికి పాప క్షమాపణ అన్ని మతములలో సమానముగాయున్నది. హిందువుల గ్రంథముగా

పేరుగాంచిన భగవద్గీతలోనూ, ముస్లీమ్‌ల గ్రంథముగా పేరుగాంచిన ఖురాన్ గ్రంథములోనూ క్రైస్తవులు మాది అను చెప్పు బైబిలులో చెప్పినట్లే పాప క్షమాపణ గురించి చెప్పియున్నారు. అన్ని మతములకు దైవగ్రంథము ఒక్కటే, తర్వాత అదే మూడు దైవగ్రంథములుగా మారిపోయినది. అందువలన మూడు గ్రంథములలోనూ పాపక్షమాపణ గురించి చెప్పి యున్నారు. ఒక గ్రంథములో పాపక్షమాపణ ఎట్లున్నదని చెప్పారో మిగతా గ్రంథములలోనూ అట్లేయున్నట్లు కలదు. అయితే పాపక్షమాపణను గురించి తమ గ్రంథములలోయున్నట్లు హిందువులుగానీ, ముస్లీమ్‌లుగానీ తెలియరు. అందువలన క్రైస్తవులు చెప్పినట్లు పాపక్షమాపణ గురించి మిగతా రెండు మతములవారు చెప్పడము లేదు.

ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో **జ్ఞానాగ్ని** వలన కర్మ దహించి వేయబడునని జ్ఞానయోగము అను అధ్యాయములో 37వ శ్లోకమున చెప్పారు.

శ్లో॥ యథైధాంసి సమిద్ధోగ్ని ర్భస్మసాత్కురు తేర్జున ।
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥

**భావము :- "అగ్నిలో ఎన్ని కట్టెలయినా కాలి బూడిద అయిపోయినట్లు జ్ఞానమను అగ్నిలో అన్ని రకముల కర్మలు కాలిపోవును"** అని చెప్పారు. ఇక్కడ దేవుని జ్ఞానము తెలిసినవానికి, వానికి తెలిసిన జ్ఞానమే అగ్నిగా మారిపోయి, వానిలోని కర్మను కాల్చివేయును. ఇదే విధానమే మిగతా రెండు గ్రంథముల లోనూ గలదు. అయితే ఇక్కడ చెప్పినట్లే చెప్పక, వేరొక రకముగా చెప్పి యుండుట వలన, ఒక గ్రంథముకు మరొక గ్రంథమునకు కొంత భాషలో మార్పు ఉండుట వలన, భగవద్గీతలో చెప్పిన విషయమే బైబిలులోనూ,

బైబిలులో చెప్పిన విషయమే ఖురాన్‌లోనూ కలదు. భగవద్గీతలో **'కర్మదహనము'** అన్నారు. బైబిలులో **'పాప క్షమాపణ'** అన్నారు. ఖురాన్‌లో **'దేవుడు క్షమాశీలుడు'** అన్నారు. దేవుడు దేనిని క్షమించును? అని ప్రశ్న వేస్తే 'మన కర్మను క్షమించును' అను జవాబే దొరుకును. కర్మదహనము అన్నా, కర్మ క్షమాపణ అన్నా, క్షమాశీలత అనినా అన్నీ ఒకే భావమునకు సంబంధించినవే! మూడు దైవగ్రంథములలో ఒకే భావమున్నదనీ, మూడు గ్రంథములలో చెప్పినవాడు ఒకే దేవుడనీ, మనుషులు తెలియకపోవడము వలన, మనుషులు మతాలను గోడ కట్టుకొనియుండుట వలన, దేవుడు చెప్పిన జ్ఞానము తెలియకుండా పోయినది. దానివలన క్రైస్తవులు "మా మతములోనే పాపక్షమాపణ కలదు, ఇతర మతములలో ఎక్కడా పాప క్షమాపణ లేదు" అని అనుకొనుచున్నారు. మిగతా రెండు మతముల వారు క్రైస్తవ మతములోనున్నట్లు మా మతములో కూడా పాప క్షమాపణ కలదని అనుకోవడములేదు. మేము పాపము చేశామని అందరూ అనుకోవడము వలన, పాప క్షమాపణ గల మతములోనికి పోతే పాపము పోతుందనే ఉద్దేశ్యముతో మిగతా మతస్థులు చాలామంది క్రైస్తవులుగా మారిపోవుచున్నారు.

ఈ విధముగా ఒక్కొక్క జ్ఞాన విషయమును ఒక్క గ్రంథమునకే పరిమితి చేసి "మా గ్రంథములోనే ఈ విషయము కలదు, మా దేవుడే ఈ విషయమును చెప్పాడు" అని కొందరంటున్నారు, ఏ జ్ఞాన విషయమైనా అది మూడు గ్రంథములలోనూ ఉండుననీ, ఏ గ్రంథములో కనిపించిన జ్ఞాన విషయమైనా, ప్రపంచములో అందరికీ దేవుడైనవాడు ఒక్కడే ఆ విషయమును చెప్పాడనీ, దేవుడు ఒక కులానికో, ఒక మతానికో, ఒక దేశానికో పరిమితమైనవాడు కాదనీ, 'విశ్వము' అను సామ్రాజ్యమునకంతటికీ

దేవుడు ఒక్కడే చక్రవర్తియనీ చాలామంది అనుకోవడము లేదు. ప్రపంచములో ఉన్నది పన్నెండు మతములే, అందులో ముఖ్యమైనవి, పెద్దవి మూడు మాత్రమే. మూడు మతములు వేరువేరు పేర్లు, వేరువేరు ఆచరణలు కలిగియున్నా మూడింటికీ ఒకే దేవుడు, ఒకే జ్ఞానము కలదు. ప్రపంచము లోని పన్నెండు మతములకు కూడా అధిపతి దేవుడే అయినా, మిగతా తొమ్మిది మతములవారు వారు స్వయముగా తమ మత జ్ఞానమును తయారు చేసుకొన్నారు. అందువలన మిగతా తొమ్మిది మతముల వారు వేరువేరు విధానములలో వేరువేరు ఆచరణలలో ఉండిపోయారు. వారికి మూడు మతములలోని జ్ఞానముతో సంబంధము లేదు.

మూడు మతములుగానీ మిగతా తొమ్మిది మతములుగానీ 5000 సంవత్సరముల పూర్వము లేనేలేవు. కృతయుగము, త్రేతాయుగము, ద్వాపర యుగము గడచిన తర్వాత కలియుగములో (3000) మూడు వేల సంవత్సరములు గడచిన తర్వాత మతము అనునది పుట్టినది. మతము ఒక దేశమునకో, ఒక ప్రాంతమునకో పరిమితమైయున్నప్పుడు, మతములో తెగలు కూడా వచ్చినవి. మతములో చీలికలు లేక తెగల మధ్య అంతర్యుద్ధములు మొదలై అక్కడక్కడ ఒకే మతములోని వారే నీదివేరు తెగ, నాది వేరుతెగ అనీ, నీ తెగకంటే నా తెగయే గొప్పదనీ, ఆధిపత్య పోరు చేసెడివారు. ఉదాహరణకు హిందూమతములో అద్వైతము, విశిష్ఠాద్వైతము అను రెండు తెగలు ఉండెడివి. మొదటిది అద్వైతముకాగా, ఆ తర్వాత వచ్చినది విశిష్ఠాద్వైతము. శంకరాచార్యులవారు అద్వైత సిద్ధాంతమును ప్రతిపాదించగా, రామానుజాచార్యులవారు విశిష్ఠాద్వైత సిద్ధాంతమును ప్రతిపాదించారు. ముందు వచ్చిన అద్వైతులు తర్వాత వచ్చిన విశిష్ఠాద్వైతులతో ఘర్షణ పడేవారు. అద్వైతులు, విశిష్ఠాద్వైతుల

మీద ఎక్కువగా దాడులు చేసినట్లు చరిత్రకలదు. అద్వైతుల దాడికి తట్టుకోలేక విశిష్ఠాద్వైత సిద్ధాంతకర్తయిన రామానుజాచార్యుల వారు దాచి పెట్టుకొని బ్రతికెడివారు. ఇలా మొదట ఒకే మతమయిన హిందూ మతములో తెగల మధ్య అంతర్యుద్ధములు మొదలయినాయనీ, అక్కడ మొదలయిన అసూయ, ద్వేషమై చివరకు మతముల మధ్య చిచ్చు పెట్టుటకు ప్రారంభించినది.

మూడు మతములలో ఉన్నది ఒకే జ్ఞానము, చెప్పినవాడు ఒకే దేవుడు అయినా, ఒకే జ్ఞానమును మూడు మతములవారు వేరువేరు కాగితములుగా చింపుకొని ఇది మా గ్రంథమని చెప్పుకొనుచున్నారు. 'మా గ్రంథము వేరు' అనుమాట వచ్చినప్పుడు దాని వెంటనే 'మా జ్ఞానమువేరు', 'మా దేవుడు వేరను' మాట రావడము జరుగుచున్నది. దానితో మతమునకు మతమునకు మధ్య భేదాభిప్రాయములు రావడమూ, ఆ భేదాభిప్రాయముల వలన అసూయ గుణము రావడమూ, అసూయ గుణము వలన కోపము అను గుణము చెలరేగిపోవడమూ, కోపము వలన హింస జరుగడము సహజమైపోయినది. భారతదేశములో **'భగవద్గీత'**యనీ, ఇతర దేశములలో **'తౌరాత్'** అనీ పిలువబడు గ్రంథములోని జ్ఞానమే మిగతా రెండు గ్రంథములలో గలదు. కొన్ని దేశములలో ఇంజీలు అనీ, కొన్ని దేశములలో బైబిలు అనీ పిలువబడు గ్రంథముగానీ, అలాగే చివరి గ్రంథమయిన ఖురాన్‌గానీ తౌరాత్ జ్ఞానముతోనే కూడుకొనియున్నవి. ఒకే హిందూ మతములో సిద్ధాంతములు వేరయిన దానివలన వేరువేరు తెగలు ఏర్పడి నట్లు, విశ్వజ్ఞానమయిన భగవద్గీతనుండి ఆచరణలు వేరయిన మిగతా రెండు మతములు ఏర్పడినవి. మొదట హిందూ మతమనే పేరే లేదు. చరిత్రలో ఇందువులు అనువారు మాత్రమే ఉండెడివారు. ఎప్పుడయితే

క్రైస్తవ మతము ఏర్పడినదో అప్పుడు ఇందువులను 'ఇందూమతస్థులు' అన్నారు. ఈ మధ్య కొన్ని వందల సంవత్సరముల క్రిందట ఇందువుల అజ్ఞానము పెరిగిపోయి చివరికి తమను 'హిందువులు' అను పేరుతో పిలుచుకోవడానికి అలవాటు పడిపోయారు. వాస్తవముగా 'హిందూ' అను పదమునకు అర్థమే లేదు. ఎంతో గొప్ప జ్ఞానములోయుండి తమలోని జ్ఞానమునకు చిహ్నముగా 'ఇందూ' అని పేరు పెట్టుకొన్నవారు, చివరకు కాలక్రమములో హిందువులుగా మారిపోయారు. వాస్తవముగా హిందూ పదమునకు అర్థముగానీ, నిర్వచనముగానీ లేదు. అదే విషయమునే మేము చాలాకాలమునుండి చెప్పుచున్నాము. హిందువులందరూ ముందు కాలములో ఇందువులుగా ఉండేవారని చెప్పినా, నేటి హిందూ సమాజము లోని కొందరు మా మాటను హేళనగా తీసుకొన్నారు. ఎవరు ఏమన్నా మా మాట వాస్తవమనుటకు ఈ మధ్యన వార్తాపత్రికలో వచ్చిన వార్తను ప్రక్క పేజీలో చూస్తే అర్థమవుతుంది.

చూశారుగా న్యాయసమ్మతముగా హిందూపదానికి సరియైన నిర్వచనమే లేదని కేంద్రప్రభుత్వమే తేల్చి చెప్పినప్పుడు, మనమంతా ఇందువులేనని ఇప్పుడయినా ఒప్పుకోవచ్చును కదా! **ఇందువు** అంటే **జ్ఞాని** అని అర్థము గలదు. మొదట భారతదేశములో అందరూ జ్ఞానులుగా యుండేవారయినందున అప్పుడు ఈ దేశమును 'జ్ఞానుల దేశము' అనెడివారు. జ్ఞానులకు చిహ్నము చంద్రుడయిన దానివలన, చంద్రుని పేరు 'ఇందు' అని ఉండడము వలన, జ్ఞానులకు గుర్తుగా అందరినీ ఇందువులనీ, ఇందువులున్న దేశమును 'ఇందూదేశమని' అనెడివారు. ఇప్పటి హిందువులకు గతచరిత్రయే తెలియకుండాపోయినది. ఒకే భగవద్గీత జ్ఞానము ప్రపంచమంతా వ్యాపించినదని చెప్పుటకు భగవద్గీతలోని జ్ఞానమే

(అనంతపురం/సోమవారం/అక్టోబర్-12-10-2015, సాక్షి న్యూస్‌పేపర్)

## 'హిందూ పదానికి నిర్వచనం తెలియదు'

ఇండోర్: రాజ్యాంగం, న్యాయపరంగా హిందూ పదానికి నిర్వచనం తెలియదని కేంద్ర హోంశాఖ తేల్చింది. హిందూ పదం నిర్వచనం చెప్పాల్సిందిగా మధ్యప్రదేశ్‌కు చెందిన చంద్రశేఖర్ గౌర్ అనే వ్యక్తి సమాచార హక్కు చట్టానికి చేసుకున్న దరఖాస్తుకు బదులిస్తూ హోంశాఖ పై విధంగా స్పందించింది. ఆ పదానికి సంబంధించిన ఎలాంటి సమాచారంలేదని కేంద్ర పౌరసంబంధాల శాఖ అధికారి పేర్కొన్నట్లుగా కేంద్రం తెలిపింది. ఎలాంటి నిర్వచనం లేనప్పుడు ఫలానా వర్గంవారు హిందువులని ఎలా నిర్ధారిస్తున్నారని, దేశంలో హిందువులు మెజారిటీగా ఉన్నారని ఎలా చెబుతున్నారని గౌర్ ప్రశ్నించారు.

మిగతా రెండు గ్రంథములలో కూడా ఉన్నది. ఆ విషయము అంతిమ దైవగ్రంథములో ఐదవ సూరాయందు కూడా చెప్పబడియున్నది. అయినా ఆ విషయము మూడు మతముల వారికి తెలియకుండా పోయినందున, ఒకే విషయమునే వేరువేరుగా అర్థము చేసుకోవడము వలన, మతమునకు మతమునకు మధ్య అగాధము ఏర్పడినది. మనుషులకు మనుషులకు మధ్య అసూయలేర్పడినవి. అపార్థముతో మొదలయిన అసూయలు తారాస్థాయికి చేరి "మనమందరమూ ఒకే జాతి మనుషులము" అనుమాటను మరచిపోయి, మనమందరము ఒకే దేవుని సంతతని (సృష్టియని) మరచిపోయి, ఒకరినొకరు శత్రువులుగా చూచుకొనుచున్నారు. క్రొత్తగా

పుట్టువారు కూడా ఏమాత్రము ఆలోచించకుండా అదే అసూయలలోనే ఉన్నారు.

ఇందూసమాజములో త్రేతాయుగములోనే కులముల చిచ్చు మొదలైనది. భారతదేశములోనికి మధ్య ఆసియానుండి వచ్చిన ఆర్యులు తమ పెత్తనమును చెలాయించుటకు, తమను ఆర్య బ్రాహ్మణులుగా చెప్పు కొనుచూ, మిగతా వారినందరినీ నీచముగా చూచుచుండిరి. అంతకు ముందు ఎంతో దైవజ్ఞానముతో కూడుకొన్న ద్రావిడ బ్రాహ్మణులను కూడా దైవధర్మములకు వ్యతిరేఖమయిన కార్యములనే చేయునట్లు చేసి ఇందువులలో జ్ఞానమనునది లేకుండా చేశారు. అప్పటినుండి మొదలయిన కుల వ్యవస్థలతో సమానముగాయున్న మనుషులను హెచ్చుతగ్గులు చేశారు. 'ఈ కులము వాడు ఆ కులము వానికంటే పెద్ద అను' భావమును తెచ్చి చివరకు అన్ని కులములకంటే బ్రాహ్మణులే గొప్పయని ప్రచారము చేశారు. మధ్య ఆసియానుండి వలస వచ్చిన వారు ఎంతో జ్ఞానవంతమైన ఇందూ దేశములో మొదట 'కులము' అను అజ్ఞాన చిచ్చు పెట్టగా చివరికది పుణాదిగా మారిపోయినది. ఇందూ సమాజము రెండువేల సంవత్సరముల పూర్వము ఇందూమతముగా మారిపోయి, చివరకు కొన్ని వందల సంవత్సరముల నుండి పూర్తి పేరు మారినదై 'ఇందూ' స్థానములో 'హిందూ' పదము వచ్చి చేరగా, హిందూ మతముగా తయారయినది.

ఇందూ మతములో దాదాపు రెండువేల సంవత్సరముల పూర్వము అశోక చక్రవర్తి ప్రచారము చేసిన బౌద్ధతత్త్వమును అణచివేయుటకు, ఆదిశంకరాచార్యులు కేరళ రాష్ట్రమునుండి బయటికి వచ్చి, బుద్ధుని జ్ఞానము వైపు ఎవరూ పోకుండా ఉండుటకు, అంతకుముందునుండీ ఇందూ సమాజములోయున్న బుద్ధున్నే హిందువు కాదనీ, అతని బోధలు ఇందుత్వము

నకు సంబంధించినవి కావని, బుద్ధున్ని అన్యమత ప్రచారకునిగా వర్ణించి, తాను ఇందూమతమును ఉద్ధరించుటకు వచ్చానని, అద్వైత సిద్ధాంతమును బుద్ధుని బోధకు ధీటుగా ఉండునట్లు ప్రచారము చేశారు. ఆ విధముగా ఆదిశంకరాచార్యులతో హిందూమతములో చీలిక వచ్చినది. ఇదంతయూ ఘతకము ప్రకారము ఆర్యులు శంకరాచార్యులతో చేయించిన పనియని ఎవరూ గ్రహించలేక పోయారు. అక్కడనుండి చీలిక పర్వము మొదలై కొంతకాలమునకు విశిష్ఠాద్వైత సిద్ధాంతము రామానుజాచార్యుల వలన బయటికి వచ్చినది. అప్పుడే అద్వైతులు విశిష్ఠాద్వైతుల మీద అసూయను పెంచుకొన్నారు. శంకరాచార్యుడు అద్వైత సిద్ధాంతమును చెప్పినా, త్రిమూర్తులలో ఒకడైన శివున్ని ఆరాధించుచూ శైవులుగా ఉండెడివారు. తర్వాత వచ్చిన రామానుజాచార్యులవారు విశిష్ఠాద్వైత సిద్ధాంతమును చెప్పినా, త్రిమూర్తులలో ఒకడైన విష్ణువును ఆరాధించుచూ తమను వైష్ణవులుగా చెప్పుకొనెడివారు. ఒకే ఇందూ మతములో శైవులు, వైష్ణవులు మేము పెద్దయనీ, మా జ్ఞానము పెద్దయనీ ఒకరికొకరు ఘర్షణ పడేవారు. దానితో వారు ధరించెడి నామము వేరు, వారు పూజించే దేవుడు వేరయి పోయారు.

కలియుగములో దేవతలలో కూడా శైవ, వైష్ణవ దేవతలని రెండుగా విభజింపబడ్డారు. దానివలన శివభక్తులు, విష్ణు భక్తులని చెప్పుకోవడము మొదలైనది. అంతకుముందు చరిత్రలో భారతదేశమంతా ఎంతో ఆధ్యాత్మిక మునకు నిలయమై ఇందూదేశముగా పేరుగాంచినది. తమలోని జ్ఞానమును కోల్పోయి, ప్రపంచమునకంతటికీ అందరికీ సృష్ఠికర్త అయిన వాడే పెద్దయను జ్ఞానమును మరచిపోయి, దేవునిచేత సృష్ఠించబడిన దేవతలను పెద్దగా పెట్టుకోవడము జరిగినది. ఈ విధముగా మొదలయిన ఒకే మత చీలికలలో

అద్వైతము, విశిష్ఠాద్వైతము అనువాటియందు అసూయలు మొదలయి చివరకు దాడులవరకు పోయి, ఒకరినొకరు చంపుకోవడము కూడా జరిగినది. ఈ విషయమును గతచరిత్రలో జరిగిన సంఘటనలను **"దశావతారము"** అను చలనచిత్రములో (సినిమాలో) కూడా చూపడము జరిగినది. ఇట్లు ఇందూమతములో మొదలయిన విధానమే మిగతా మతములలో కూడా వచ్చినది. మతములు తయారయిన తర్వాత వాస్తవ దైవజ్ఞానము గలవి మూడు మతములుగానే గుర్తింపబడ్డాయి. మూడు మతములు దేవుడు సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానమును అనుసరించేయున్నాయి. దేవుడు సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానము చివరకు మూడు గ్రంథములుగా మూడు మతములలో కనిపిస్తున్నది. నేడు హిందూ, క్రైస్తవ, ఇస్లామ్ మతములుగా చెప్పబడుచున్న వాటికి హిందువులకు **'భగవద్గీత'**, క్రైస్తవులకు **'బైబిలు'** ముస్లీమ్‌లకు **'ఖురాన్'** గ్రంథము ఆధారముగాయున్నవి. మూడు గ్రంథముల లోనూ ఒకే దైవ జ్ఞానము ఇమిడియుండగా, దానిని మూడు మతముల వారు గ్రహించక, మా జ్ఞానము గొప్పయని మిగతా రెండు మతములతో వాదించుచున్నారు. చెప్పినవాడు ఒకే దేవుడనీ, చెప్పబడినది ఒకే జ్ఞానమనీ, తెలియని మనుషులు తమ మతము మీద ప్రేమ అభిమానమును, ఇతర మతముల మీద అసూయ, క్రోధములను పెంచుకొంటున్నారు. ఇతర మతముల మీదగల అసూయ చివరకు క్రోధమై, క్రోధము హింసగా మారుచున్నది. నేడు మత సంబంధ హింసలే భూమిమీద అధికముగా కనిపించుచున్నవి. ఒక మతము వారు అనేక గుంపులుగా విడిపోయి, ఆ గుంపులకు ప్రత్యేకమయిన పేర్లుపెట్టుకొని, హింసలకు పాల్పడుచున్నారు. తర్వాత మేమే ఆ పనిని చేసినదని ప్రకటించుకొనుచున్నారు.

ఈనాడు పరమతద్వేషము అనునది, స్వమత ప్రేమ అనునది ఒక మతమునకే పరిమితి కాలేదు. మనము ముఖ్యముగా చెప్పుకొను మూడు

మతములలో ఉన్నాయి. పరమత అసూయ అనునది ప్రతి మతములో యున్నా, కొన్ని ప్రత్యక్షముగా కనిపించుచున్నవి, కొన్ని పరోక్షముగా కనిపించుచున్నవి. కొందరు "మా మతములో పరమత సహనమున్నది, మేము అందరికంటే మత సామరస్యముగా ఉంటాము" అని అంటుంటారు. పరమత ద్వేషము ఫలానా మతములో ఎక్కువగా యున్నదని ఇతర మతము వైపు వ్రేలెత్తి చూపుతుంటారు. అయినా వారు చెప్పుమాట వాస్తవము కాదని, ప్రతి మతములోనూ నూటికి నూరుపాళ్ళు పరమత ద్వేషమున్నదనీ చెప్పవచ్చును. ఇక్కడ మా మాటను విశ్వసించలేనివారు మమ్ములను క్రింది విధముగా ప్రశ్నించవచ్చును.

**ప్రశ్న :- అందరిలోనూ పరమత ద్వేషము ఎక్కువ తక్కువలు లేకుండా నూటికి నూరుపాళ్ళు ఉందని మీరు ఏ ఆధారముతో చెప్పుచున్నారు? అలా ఉంటే ముస్లీమ్‌లవలె హిందువులు హింసలో పాల్గొనలేదు. హిందువులవలె క్రైస్తవులు ఎక్కడా ఇతరుల మీద దాడులు చేయలేదు. ముస్లీమ్‌లకంటే హిందువులు, హిందువులకంటే క్రైస్తవులు సౌమ్యులుగా కనిపిస్తున్నారు. ప్రత్యక్షముగా కనిపించు సత్యము ఇలా ఉండగా మీరు అన్ని మతములవారు సమానముగా మతద్వేషములు కల్గియున్నారని చెప్పడములో ఎంత నిజమున్నదో తెలియుచున్నది. మీరు కూడా అసత్యమును చెప్పుచున్నారని మేము అనుకొంటున్నాము. దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** కనిపించేది సత్యము, కనిపించనిది అసత్యము అనుకొంటే మన వీపు మనకే కనిపించదు. కనిపించనంతమాత్రమున మన వీపు అసత్యము కాదు కదా! అలాగే ముస్లీమ్‌లు చేయునవి ప్రత్యక్షముగా కనిపించుచుండవచ్చును. మిగతావారు చేయునవి కనిపించకయుండ వచ్చును. ఒక ముస్లీమ్ ఆత్మాహుతి దాడి చేసి ఇతర మతముల వారిని

వంద మందిని చంపాడనుకొనుము. అది ప్రత్యక్ష హింస, కావున ఫలానా మతమువాడు మతద్వేషముతో వందమందిని చంపాడని చెప్పవచ్చును. ఎందుకనగా! అది ప్రత్యక్ష విషయము అయినందున అందరికీ తెలుసు. అదే ఒక క్రైస్తవుడు పరోక్షముగా తన తెలివి చేత ఎవరికీ తెలియకుండా వేయిమందిని ఇతర మతస్థులను చంపాడనుకోండి, అప్పుడది ఎవరికీ తెలియదు. హింసచేసినవాడు కూడా శాంతస్వభావునిగానే కనిపించును. ఎవరి తెలివి వారిది, ఒకరు తెలివితక్కువగా హింసామార్గములో ప్రయాణించగా, మరొకడు ఎంతో తెలివిగా తాను కూడా హింసామార్గము లోనే ప్రయాణించును. అయితే తెలివి తక్కువగా చేసిన వానిపని బయటికి కనిపించుచున్నది. ఎక్కువ తెలివి కల్గి చేసిన వాని పని కనిపించలేదు. కొందరికి అసూయయున్నా బుద్ధిబలముగానీ, శరీర బలముగానీ లేనివారై హింసను చేయలేక మౌనముగాయున్నారు. అంతమాత్రమున వారిని హింసావాదులు కాదని చెప్పలేము. ఇక్కడ ఎవరిలో ఎంత పరమత ద్వేషమున్నది? అను ప్రశ్నకు అందరిలో సమానముగా యున్నది, ఎవరిలో గానీ ఇతరులకంటే ఏమాత్రము తక్కువలేదని చెప్పుచున్నాము. అందరి లోనూ నూటికి నూరుపాళ్ళు అసూయ ఉన్నదనియే చెప్పుచున్నాము.

**ప్రశ్న :- అయితే మీ మాటప్రకారమే అనుకొంటే మీరు ఎంతో మత సామరస్యము గలవారిగా, అందరికీ ఒకే దేవుడు, ఒకే బోధ, ఒకే జ్ఞానము అంటుంటారు కదా! మీరు ఏమి చెప్పినా మీరు కూడా ఒక మతములో పుట్టినవారే! మీరు హిందువుగానే చెప్పుకొంటున్నారు. అందరిలో పరమత ద్వేషమున్నదని చెప్పినట్లు మీలో కూడా పరమత ద్వేషముండవలెను కదా! మీరు తెలివిగా ప్రవర్తించి బయటికి అసూయ ఉన్నట్లు కనిపించకుండా ఉంటూ, నీ వరకు నీవు ఇతరులను పరోక్షముగానయినా హింసించవచ్చును కదా! దీనికి మీరేమంటారు? మీకు మత ద్వేషము లేదంటారా?**

**జవాబు :-** ప్రతి మతములోనూ, ప్రతి వ్యక్తిలోనూ పరమతము మీద అసూయ ఉన్నదని మేము చెప్పినమాట వాస్తవమే. నేను ఆ మాటను శాస్త్రాధారముతోనే చెప్పాను. గ్రుడ్డిగా చెప్పలేదు.

**ప్రశ్న :- ఏ శాస్త్రాధారముతో చెప్పారు? ఏ శాస్త్రములో మతద్వేషముల గురించి వ్రాశారో చెప్పండి?**

**జవాబు :-** అడిగితే దేనినయినా చెప్పగలము. నేను బ్రహ్మవిద్యా శాస్త్రమును అనుసరించి అన్ని మతములలో అందరిలో అసూయ కలదని చెప్పాము. బ్రహ్మవిద్యా శాస్త్రము మనిషి జీవితమును, జీవిత సారాంశమును తెల్పు చున్నది. ఒక మనిషి ఏ మతములోనయినా పుట్టియుండవచ్చును. వాడు మాత్రము అనగా ఆ శరీరములో నివసించు జీవుడు మాత్రము తలయందు గల గుణచక్రములో గుణముల మధ్యలో ఉండును. జీవుడు నివసించు గుణ భాగములు మూడుకాగా, ప్రతి గుణభాగములోనూ ఆరు మంచి గుణములు, ఆరు చెడు గుణములు ఉండును. చెడు గుణముల వలననే బయట ఎన్నో అనర్థములు జరుగుచున్నవి. చెడు గుణములు వరుసగా ఇలా కలవు. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సర అనునవి ఆరు చెడు గుణములుకాగా అందులో ఎక్కువ బలమైనవి, ఎక్కువ ప్రభావము గలవి రెండు గలవు. అవి మొదటిదయిన ఆశ, చివరిదయిన అసూయ. ఈ రెండు మనిషిలో బలముగా ఉండును. ఆశ అను గుణము మనిషి యొక్క సంపాదనవైపే పోవును. ఆశ స్వంత విషయములలో మాత్రముండును. అయితే అసూయ లేక ద్వేషము అనునది ఇతర విషయములన్నిటి మీద ఉండును. ఆశ కొన్ని విషయముల వరకే పరిమితి కాగా, అసూయ అన్ని విషయములలో ఉండును. తనకు ఏమాత్రము సంబంధములేని ఇతరులపట్ల కూడా అసూయ గుణము పనిచేయును.

మనిషి శరీర నిర్మాణము, అందులో గుణములు, గుణములలో జీవుని నివాసము ఇవన్నియూ బ్రహ్మవిద్యా శాస్త్రమునకు సంబంధించిన విషయములే. బ్రహ్మవిద్యా శాస్త్రమును సంపూర్ణముగా తెలిసిన వ్యక్తి ఎవడయినా ఇతరుల మీదగానీ, ఇతర మతముల మీదగానీ అసూయ పడడు. ఎందుకనగా మూడు మత గ్రంథములు బ్రహ్మవిద్యా శాస్త్రమునకు సంబంధించినవేనని తెలిసినప్పుడు, తన గ్రంథములోని జ్ఞానమే ఇతర మత గ్రంథములలో ఉన్నదని తెలిసినప్పుడు, తన దేవుడే ఇతరులు చెప్పు దేవుడని తెలిసినప్పుడు, విషయమంతా తనదే అయివుండుట వలన అక్కడ అసూయ గుణమునకు తావే ఉండదు. ఇతర విషయముల మీదగానీ, ఇతరుల మీదగానీ అసూయ పనిచేయునుగానీ, తన విషయము మీదనే తన అసూయ పనిచేయదు. అతనికి మూడు మతములు ఒక్కటిగానే కనిపించు చుండును. మూడు మతములలో వేరువేరుగా చెప్పు దేవుడు ఒక్కడుగానే తెలియుచుండును. మూడు మత గ్రంథములలోని జ్ఞానము ఒక్క దేవుని జ్ఞానముగానే కనిపించుచుండును. అటువంటి వానికి పరమత ద్వేషము ఉండదు. స్వమతమే పరమతముగా, పరమతమే స్వమతముగా యుండుట వలన పరమత అసూయ అనునది అతనిలో ఉండదు.

నేను అందరివలె దైవజ్ఞానమును శరీరము బయట వెతకలేదు. శరీరమందే బ్రహ్మవిద్యను గ్రహించగలిగాము. శరీరములోనే జీవుని నివాసము కలదని, దేవుని నివాసము కూడా కలదని గ్రహించగలిగాము. ఈ మార్గములో జ్ఞానము తెలిసిన దానివలన, నాకు మతము అనునది ఎక్కడా కనిపించలేదు. దేవుడు చెప్పిన జ్ఞానములో, మూడు దైవగ్రంథములలో 'మతము' అను పేరు ఎక్కడా లేదు. మూడు దైవ గ్రంథములలో దైవ పథము కనిపించుచున్నది. దైవపథము అనగా 'దైవమార్గము' అని అర్థము.

మూడు మతములలోని దైవత్వము నాకు తెలిసినది, కావున నేను ఇందువు నయినా నాకు ఇతర మతముల మీద అసూయ లేదు. మా దృష్ఠిలో మతముల పేర్లను మనిషి సృష్ఠించాడు తప్ప, దేవుడు తన గ్రంథములలో ఎక్కడా మత ప్రస్థావన తీసుకరాలేదు. నాకు అన్ని మతములు సమానమే, అన్ని గ్రంథములు సమానమే. అందువలన నేను అన్ని గ్రంథములలోని జ్ఞానమును సులభముగా చెప్పగలుగుచున్నాను. ఇతరులు తన మతమును గురించిన గ్రంథములోని జ్ఞానమునే సరిగా తెలియకున్నారు. అటువంట ప్పుడు ఇతర మత గ్రంథములోని జ్ఞానము ఏమాత్రము తెలియలేరు. హిందువులకు భగవద్గీతలోని జ్ఞానము పూర్తిగా తెలియునని చెప్పలేము. భగవద్గీత గ్రంథరూపముగా వచ్చి దాదాపు 5000 సంవత్సరములయినా అది మానవులకు సంపూర్ణముగా అర్థము కాలేదు. ఎన్నో విషయములలోని అర్థమును అపార్థము చేసుకొన్నాము. హిందువులకు ఇంతవరకు తన దైవగ్రంథమయిన భగవద్గీతను గురించిన అవగాహనే సరిగా లేనప్పుడు, ఇతర మత గ్రంథముల గురించి ఏమీ తెలియలేరు. దానివలన ప్రతి మనిషి ఇతర మతముల మీద, ఇతర దైవగ్రంథముల మీద అసూయ కల్గియున్నాడని జ్ఞానమును అనుసరించి చెప్పుచున్నాము. నేడు పరమత ద్వేషము ఎక్కడ చూచినా, ఏ మతములో చూచినా ప్రత్యక్షముగా కనిపించుచున్నది. అందువలన మనిషి శరీరమును, శరీరములో జీవుని స్థానమును, జీవుని రూపమును తెలిసి, జీవునికి గుణములతో యున్న సంబంధమును కూడా తెలిసి, ఒకనికి మరొక మతము మీద ద్వేషము ఎంత కలదో సులభముగా చెప్పుచున్నాము.

**ప్రశ్న :- మీరు మనిషే, ఇతరులు మనుషులే. మీకు తెలిసిన జ్ఞానము మీవలె మనుషులయిన వారికి ఎందుకు తెలియలేదు?**

**జవాబు :-** తమకు తెలియని జ్ఞానము కలదని ఎవరూ అనుకోవడము లేదు. వారందరూ తమకు తెలిసినదే జ్ఞానమని, దానిని మించిన జ్ఞానము లేదని అనుకోవడము వలన, వారు జ్ఞాన విషయములో పెద్ద అడ్డగోడను కట్టుకొన్నట్లయినది. తమకు తెలియని జ్ఞానముమీద ఏమాత్రము దృష్ఠి సారించని దానివలన వారికి తెలిసినదే జ్ఞానమయినది. తెలియనిది అంతా వారి దృష్ఠిలో అజ్ఞానమయినది.

**ప్రశ్న :- మీరు చదివిన భగవద్గీతనే చదువువారు ఎందరో గలరు. వారు కూడా తమకు తెలియని జ్ఞానమును తెలుసుకోవాలను ఉద్దేశ్యముతోనే చదువుచున్నారు కదా! అటువంటప్పుడు మీకు తెలిసిన జ్ఞానము మిగతా వారికి ఎందుకు తెలియలేదు?**

**జవాబు :-** దేవుడు కనిపించువాడు కాదు. అందువలన దైవజ్ఞానమంతయు స్థూలముగా కాకుండా సూక్ష్మముతో కూడుకొనియున్నది. నేడు స్థూలముగా చూచువారే కలరు. సూక్ష్మముగా యున్న జ్ఞానము గ్రంథము చదివినా వారికి తెలియడము లేదు. దైవజ్ఞానము స్థూలమే కాకుండా సూక్ష్మముగా యున్నదని తెలిసి, పూర్తి శ్రద్ధగలిగి చదువువారికి దేవుని జ్ఞానము అర్థము కాగలదు.

**ప్రశ్న :- భగవద్గీతను ఎందరో చదివిన స్వామీజీలు, పండితులు, జ్ఞానులని పేరుగాంచిన వారు గలరు. అందులో ప్రతి శ్లోకమునకు ప్రతి పదమునకు అర్థము వ్రాసినవారు కలరు. ప్రతి అక్షరమునకు వివరము చెప్పిన వారు గలరు. వారికి సూక్ష్మజ్ఞానము అర్థముకాలేదంటారా? మీకు తెలిసినది వారికి తెలియదంటారా?**

**జవాబు :-** ప్రపంచ విషయములో ఎంతయినా తెలిసినవారుండవచ్చును గానీ, పరమాత్మ విషయములో తెలిసినవారు అరుదుగానే యున్నారని చెప్పు

చున్నాము. భగవద్గీతను ఎందరో పెద్దలు, స్వామీజీలు చదివియుండ వచ్చును. సంస్కృతములో పండితులుగా యున్నవారు ప్రతి పదమునకు, ప్రతి అక్షరమునకు వివరము వ్రాసియుండవచ్చును. అవన్నీ సరియైన భావములే అయితే నేడు ప్రజలలో అజ్ఞానమెందుకున్నది? పరమత ద్వేషమెందుకున్నది? మిగతా మత గ్రంథములను దైవగ్రంథములుగా తెలియక ద్వేషముతో ఎందుకు చూస్తున్నారు? శరీరాంతర్గత జ్ఞానము తెలియక బయట దేవున్ని ఎందుకు వెదకుచున్నారు? మనిషి రాగద్వేషము లలో ఎందుకు చిక్కుకొన్నాడు? ఈ విధమైన ప్రశ్నలన్నిటికీ మనిషికి దేవుని జ్ఞానము అర్థము కాలేదనునదే! సరియైన జవాబు. హిందువులకు తాము మొదట ఇందువులమను విషయమే తెలియకుండా పోయినది. అట్లే భగవద్గీత ఇప్పటివరకు అర్థము కాలేదు. క్రైస్తవులకు బైబిలు, ముస్లీమ్‌లకు ఖురాన్ గ్రంథములోని జ్ఞానము సరిగా, సంపూర్ణముగా తెలియదనియే చెప్పవచ్చును. గ్రంథములో వ్రాసినది ఒక్కటైతే అర్థమయినది మరొకటిగా యున్నది. ప్రతి దానిని నిజ భావముతో అర్థము చేసుకోలేకున్నారు.

**ప్రశ్న :- వారు చదివినది దానిని నిజ భావములో కాకుండా ప్రక్క భావములో ఎలా అర్థము చేసుకొంటారు? ఒక విషయమును చదివితే ఉన్నదున్నట్లు తెలియగలదు. రాత్రి చీకటిగా, పగలు వెలుగుగా ఉండునని వ్రాసియుంటే అందులో అర్థము కానిది ఏమీ ఉండదు. అలాగే ప్రతి భాషలో భావము తెలిసినవారే భాషను చదువగలరు, అర్థము చేసుకోగలరు? సంస్కృత పండితులు సంస్కృతములో వ్రాసిన దానిని బాగా గ్రహించగలరు. అలాగే తెలుగు పండితులు తెలుగు వ్రాతను బాగా అర్థము చేసుకోగలరు. అటువంటప్పుడు మీరు మూడు దైవగ్రంథములు మూడు మతముల వారికి అర్థము కాలేదని ఎలా చెప్పగలరు? ఎక్కడయినా ఒక పదమునకు రెండు**

**మూడు అర్థములున్నప్పుడు ఆ సందర్భమునకు తగిన అర్థమునే తీసుకోవడము జరుగుచున్నది. 'కరము' అనగా చేయి, కప్ప, కోతి, విష్ణువు అని నాలుగు అర్థములుగలవు. ఒక వాక్యములో "చెట్టుమీద కరము గలదు. చెంపమీద కరము గలదు, నీటిమీద కరము కలదు" అని ఉన్నదను కొనుము. చెట్టుమీద కరము అన్నప్పుడు చెట్టుమీద కోతి కలదని సందర్భమునుబట్టి కరము అను దానికి అర్థము తీసుకొంటాము. అట్లే చెంపమీద కరము అనుమాటలో చెంపమీద చేయి కలదు అని చెప్పవచ్చును. నీటి మీద కప్ప కలదని చెప్పగలము గానీ, నీటిమీద కరము అన్నప్పుడు కరము అను పదమునకు సందర్భానుసారముగా కప్ప అని అర్థము చెప్పవచ్చును. నీటి మీద కప్ప కలదని చెప్పగలముగానీ, నీటిమీద కోతి ఉందని చెప్పలేము కదా! ఈ విధముగా ఒకే పదమునకు రెండు మూడు అర్థములున్నప్పుడు కూడా, ఆ పదమునకు అర్థము సందర్భానుసారముగా చెప్పగలుగు వారున్నప్పుడు, మీరు ఒక గ్రంథములోని జ్ఞాన విషయమే తెలియదనడము విడ్డూరముగా ఉన్నది. మీ మాటలనుబట్టి మీరు ఇతరుల మీద అసూయతోనే మాట్లాడుచున్నారని, మీరు హిందువులుగా యుండి హిందువులను కూడా అసూయగా చూస్తూ, హిందువులకు భగవద్గీత అర్థము కాలేదని చెప్పుచున్నారని మేమనగలము. దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** నేను మీకు అర్థము కాలేదని నాకు బాగా తెలియుచున్నది. ఎదురుగా మాట్లాడు మనిషిలోని భావమును అర్థము చేసుకోలేని మనము, మాటలు లేకుండా వ్రాతలు మాత్రమున్న గ్రంథములోని భావము అర్థమయిన దంటే నమ్మమంటారా? దేవుని జ్ఞానము మనిషి భావమునకు అతీతమైనది. అందువలన భగవద్గీతయందు అక్షర పరబ్రహ్మ యోగమున 20వ శ్లోకములో **'భావోన్యో'** అను పదమును ఉపయోగించారు. **'నీకు తెలిసిన భావముకంటే**

**అన్య భావము'** అని అక్కడ అర్థము. దేవుని అనుమతి, కృప లభించితే దేవుని జ్ఞానము సులభముగా అర్థమగును. దేవుని కృపలేనిది ఎంత పెద్ద పండితునికయినా దేవుని జ్ఞానము అర్థము కాదనియే చెప్పవచ్చును. **"దేవుని జ్ఞానము యొక్క సూక్ష్మ భావములు దేవునికి తప్ప ఏ మనిషికీ తెలియవు"** అని చివరి దైవగ్రంథములో మూడవ సూరాలో ఏడవ ఆయత్‌లో చెప్పబడినది. అందువలన దేవుని జ్ఞానమునకు సరియైన భావము దేవుడు తెలియజేస్తేనే మనకు తెలియబడుతుంది. ప్రపంచ విషయములనే సరిగా తెలియలేని మనుషులు దైవజ్ఞానమును సరియైన భావములో తెలియలేరనియే చెప్పవచ్చును. ప్రతి పదమునకు, ప్రతి అక్షరమునకు అర్థము తెలిసినవారు కేవలము భాషా పండితులేగానీ, భావపండితులు కారు. "అర్థము" అను పదమునకు అర్థము, ధనము లేక వివరము అను రెండు భావములుండును. ధనములో ప్రపంచ ధనమైనా కావచ్చును, జ్ఞాన ధనమైనా కావచ్చును. అయితే 'అర్థము' అను పదమునకు ప్రపంచ ధనమనియే అందరూ చెప్పగలరుగానీ, జ్ఞానధనమని ఎవరూ చెప్పలేరు. అర్థము అనగా వివరము లేక భావము అని చెప్పవచ్చును. అయితే అన్ని ప్రపంచ విషయముల వివరములయందే ఈ పదమును వాడెదము గానీ, దేవుని విషయములోని వివరము లేక భావము అను ఉద్దేశ్యముతో ఎవరూ వాడలేదు. ప్రపంచ విషయములలో కూడా ఎక్కడ ఏ పదమును వాడవలెనో తెలియని పండితులున్నారంటే ఆశ్చర్యపడవలసిన అవసరము లేదు. అటువంటి స్థితిలో ప్రపంచ జ్ఞానమే అందరికీ సరియైన పద్ధతిలో అర్థము కావడము లేదని తెలియుచున్నది. మా మాట సత్యమనుటకు ఒక ఉదాహరణను గమనిద్దాము.

ఒక ఊరిలో న్యాయసంబంధమైన ఏ సమస్య వచ్చినా ఆ ఊరి ప్రజలు తమ ఊరి పెద్దవద్దనే తమ సమస్యకు న్యాయమైన తీర్పు పొందెడి

వారు. ఆ ఊరి ప్రజలు ఏ కోర్టుకు తమ సమస్య పరిష్కారము కొరకు పోయెడి వారు కాదు. అట్లు పోయినా న్యాయమైన తీర్పు వస్తుందను నమ్మకము వారికి లేదు. ఒకవేళ న్యాయమైన తీర్పు వచ్చినా, అది కొన్ని సంవత్సరములకుగానీ రాదని వారికి తెలుసు. కష్టపడి బ్రతికే ఆ ఊరి ప్రజలు పట్టణములలో ఉండే న్యాయస్థానములకు (కోర్టులకు) పోయినా, అక్కడ న్యాయవాదులకు వారు అడిగినంత డబ్బులు ఇచ్చుకోలేని పరిస్థితి ఉండుట వలన, ఆ ఊరి ప్రజలు తమ పెద్దల కాలమునుండి ఆ ఊరి పెద్దవద్దనే తమ సమస్యకు న్యాయసమ్మతమైన తీర్పును పొందెడివారు. న్యాయసమ్మతమైన తీర్పు తీర్చే గ్రామపెద్ద ప్రజలు తనవద్దకు తెచ్చిన సమస్యకు ఒకటి లేక రెండు రోజులలో సరియైన తీర్పునిచ్చెడివారు. తమ గ్రామపెద్ద ఇచ్చిన తీర్పును ప్రజలందరూ గౌరవముతో స్వీకరించెడివారు. వచ్చిన తీర్పును అందరూ సగౌరవముగా అమలు చేసుకొనెడివారు. తమ గ్రామపెద్ద అయిన న్యాయధిపతి తీర్పు అందరికీ శిరోధార్యముగా ఉండెడిది. అటువంటి ఉద్దేశ్యములోయున్న ప్రజలు తమ చిన్నా పెద్ద సమస్యలను తమ గ్రామపెద్ద వద్ద విన్నవించుకొనెడివారు. అందువలన ఆ ఊరిలో ప్రజల మధ్య ఎటువంటి ఘర్షణలు జరిగేవి కావు. ఆ ఊరిలోని పద్ధతిని చూచిన మిగతా చుట్టు ప్రక్కల గ్రామ ప్రజలు కూడా ఆ ఊరికి వచ్చి తమ సమస్యలకు న్యాయమైన తీర్పు పొందెడివారు.

ఒక దినము ప్రక్క ఊరి మనిషి ఆ ఊరిలోని బంధువుల ఇంటికి వచ్చాడు. వచ్చినవాడు తాను చిన్నవయస్సు గల కోతిని ఇంటిలో పెంచుకొనెడివాడు. మూడు సంవత్సరములుగా కోతికి మనిషికి ఒకరి నొకరు విడువలేని బంధము ఏర్పడినది. కొద్దిసేపు కూడా కోతి తనను పెంచిన వ్యక్తిని వదలి ఉండేది కాదు. కోతిని సాకిన వ్యక్తి కూడా కోతిని

వదలి ఉండేవాడు కాదు. తన కోతిమీద ఎక్కువ ప్రేమను పెంచుకొన్నాడు. అటువంటి స్థితిలో కోతిని తనవెంట తీసుకొని ఆ ఊరికి రావడము జరిగినది. ఊరి మధ్యలోనికి వచ్చిన తర్వాత తనవెంటనున్న కోతిని చూచి ఒక కుక్క మొరిగి కోతిని భయపెట్టింది. అంతటితో ఊరకుండక కోతిని కరవాలను ఉద్దేశ్యముతో దూరమునుండి పరిగెత్తుకొని కోతివద్దకు రాబోయింది. అప్పుడు తన కోతిని కుక్కబారినుండి రక్షించుటకు కోతిని సాకిన వ్యక్తి తన చేతిలోని కర్రతో కుక్కను ఒకవేటు కొట్టాడు. కొట్టిన ఒక వేటు కుక్కకాలికి తగలడము వలన కుక్క కాలు విరిగిపోయింది. అప్పుడది నడువలేని పరిస్థితిలో కుంటుకుంటూ అక్కడినుండి పోయింది. అక్కడ జరిగిన విషయమునంతటినీ దూరమునుండి గమనించిన కుక్క యజమాని తన కుక్కకు కాలు విరిగిపోవడమును చూచి, చాలా బాధపడి మరుసటి దినము ఊరి పెద్దవద్దకు ఆ సమస్యను తీసుకొనిపోయి, దానికి తగిన న్యాయమును అడిగాడు. ప్రతి చిన్న పెద్దసమస్యలన్నిటికీ న్యాయము చెప్పు గ్రామ పెద్ద, ఆ సమస్యను ఇరువురి సమక్షములో విచారించి, కోతి యజమానిని ఈ విధముగా అడిగాడు.

**గ్రామపెద్ద :-** నీ వెంటనున్న కోతి నీదేనా, నీవు స్వయానా సాకినదేనా?
**జవాబు :-** అవును! నాదే. నేను మూడు సంవత్సరములనుండి ఈ కోతిని సాకుచున్నాను.
**గ్రామపెద్ద :-** నీ కోతిని చూచి కుక్క మొరిగింది, పరిగెత్తుకొని నీవరకు వచ్చింది. అది కుక్కకున్న సహజ లక్షణము. అయితే నీవు నీవద్దగల కట్టెను చూపి కుక్కను బెదిరించివుంటే సరిపోయేది కదా! అప్పటికీ కుక్క పోకుండా మీదికి వస్తే అప్పుడు కొట్టినా తప్పులేదు. దానిని బెదిరించి దూరము పోవునట్లు చేయకుండా కొట్టడము తప్పేయగును. నీవు కుక్కను

కొట్టావా? నీవు కొట్టిన వేటుకు కుక్కకాలు విరిగినట్లు ఆరోపణ వచ్చింది. దీనికి నీవేమంటావు?

**జవాబు :-** అవును నేను కుక్కను కొట్టాను. నేను కొట్టిన దానివలననే దానికాలు విరిగింది.

**గ్రామపెద్ద :-** కుక్కకు కాలు విరిగినందుకు కారణము నీవే కావున, ఈ తప్పుకు బాధ్యుడవు నీవేయగుదువు. దానివలన నీవు మేము నిర్ణయించినట్లు ఆచరించవలసియుంటుంది. దానికి సమాధానమే కదా!

**జవాబు :-** మీరు నిర్ణయించిన తీర్పు ప్రకారము నేను నడుచుకొనుటకు సమాధానముగా ఉన్నాను.

**గ్రామపెద్ద :-** నేటినుండి ఈ క్కుకను నీవు నీ ఇంటికి తీసుకొనిపోయి, విరిగిపోయిన కాలు తిరిగి బాగుపడి కుక్క సరిగా నడుచువరకు దానిని చూచుకొను బాధ్యత నీదే, కుక్క కాలు సరిపోయిన తర్వాత కుక్కను దాని యజమానికి అప్పజెప్పవలెను.

**జవాబు :-** మీరు చెప్పినట్లు నేటినుండి కుక్క కాలు బాధ్యత నాదే. కాలు బాగయిన తర్వాత మీరు చెప్పినట్లు కుక్కను దాని యజమానికి అప్పజెప్ప గలను.

ఈ విధముగా కుక్కను కొట్టిన నేరానికి ఆ గ్రామపెద్ద తీర్పు ఇవ్వడము జరిగినది. ఆ తీర్పును చూచి తమ గ్రామ పెద్ద మంచి తీర్పును ఇచ్చాడని ఆ ఊరి ప్రజలందరూ గ్రామపెద్దను పొగడడము జరిగినది. తమ గ్రామపెద్ద ఖచ్చితమైన న్యాయనిర్ణేతయని గొప్పగా చెప్పుకొనెడి వారు. కుక్క కాలు విరిగిన సంఘటన జరిగిన రెండు నెలలకు అదే ఊరిలో మరియొక సంఘటన జరిగి, ఆ విషయము కూడా గ్రామపెద్ద దగ్గరికి వచ్చినది. ఆ సమస్య ఏమనగా! ఒక మూడు నెలల గర్భిణీ స్త్రీ తలనొప్పితో

ఆ ఊరిలోనేయున్న డాక్టరు దగ్గరకు పోగా, డాక్టరు తలనొప్పికి మందులు ఇచ్చి పంపాడు. ఆ మందులు ఆమె తినిన వెంటనే ఆమెకు గర్భస్రావము జరిగినది. డాక్టరుగారు ఇచ్చిన మందుల వలననే తనకు గర్భస్రావమయిన దని ఆమె డాక్టరు దగ్గరకు పోయి గొడవపడినది. అప్పుడు డాక్టరు "నేను ఇచ్చిన మందులు తలనొప్పికి మాత్రమే, నా మందుల వలన నీ గర్భము పోలేదని" సర్ది చెప్పాడు. అయినా ఆ విషయము డాక్టరుకి రోగికి మధ్యలో పెద్ద గొడవగా మారినది. అప్పుడు ఆ విషయమును ఇరువురు గ్రామపెద్ద వద్దకు తీసుకొని పోవడము జరిగినది. అప్పుడు గ్రామపెద్ద క్రింది విధముగా విచారణ జరుపడమైనది.

**డాక్టరు :-** అయ్యా! మీరు నాకు తగిన న్యాయమును చేయమని కోరుచున్నాను.

**గ్రామపెద్ద :-** మీ సమస్య ఏమిటో సవివరముగా చెప్పండి.

**ఆమె :-** అయ్యా! నేను మూడు నెలల గర్భముతోయుంటిని. నాకు తలనొప్పిగా యుండుట వలన, తలనొప్పి నివారణ కొరకు డాక్టరుగారి వద్దకు పోయి నా తలనొప్పిని గురించి చెప్పాను. అప్పుడు డాక్టరుగారు మందులిచ్చి వాడమని చెప్పారు. మందు వాడితే తలనొప్పి పోతుంది అని చెప్పాడు. అలాగే వాడినాను. అయినా తలనొప్పి పోలేదుగానీ, నాకున్న మూడు నెలల గర్భము పోయినది. ఆ విషయమై మా మధ్య గొడవ ప్రారంభమయినది. దీనికి మీరే న్యాయము చెప్పగలరని ఆశించుచున్నాను.

**గ్రామపెద్ద :-** నీవు డాక్టరు వద్దకు పోయినప్పుడు, నీ తలనొప్పిని గురించి చెప్పినప్పుడు, నీవు గర్భవతినను విషయము డాక్టరుగారికి చెప్పావా?

**ఆమె :-** చెప్పాను. ముందు నాకు మూడు నెలల గర్భమున్నదని చెప్పిన తర్వాతే తలనొప్పిని గురించి చెప్పాను.

**గ్రామపెద్ద :-** ఏమయ్యా! డాక్టరు గారూ, ఆమె చెప్పినమాట వాస్తవమేనా?

**డాక్టరు :-** ఆమె చెప్పినమాట వాస్తవమే. అయినా నేను ఇచ్చిన మందు తలనొప్పికి మాత్రమే!

**గ్రామపెద్ద :-** తల నరములలో రక్తప్రసరణము బాగా జరుగునట్లు చేయు ఎస్ప్రిన్ మాత్రలు ఇచ్చావా లేక పెయిన్‌కిల్లర్ మాత్రలయిన పారాసిటమోల్ లాంటివి ఇచ్చావా? రెండు రకముల మందులు తలనొప్పి నివారణ మందులే అయితే వాటిలో ఏది ఇచ్చావు?

**డాక్టరు :-** తలనాడులలో రక్తప్రసరణ సరిగా లేక తలనొప్పి వచ్చిందని నిర్ధారణకు వచ్చి, రక్తప్రసరణను ఉత్తేజపరుచు ఎస్ప్రిన్ మాత్రలు ఇచ్చాను. పెయిన్‌కిల్లర్ మందులు ఇవ్వలేదు.

**గ్రామపెద్ద :-** గర్భిణీ మనుషులకు ఆ మందులు ఇస్తే రక్తప్రసరణకు ప్రేరణ జరిగి గర్భస్రావమగుటకు అవకాశముగలదు. నీవు ఇచ్చిన మందుల వలన గర్భస్రావము జరిగియుండవచ్చును కదా! అట్లుకాకుండా నొప్పి నివారణకు కావలసిన పెయిన్‌కిల్లర్ మందులు ఇచ్చియుంటే గర్భస్రావము జరిగి యుండేది కాదు. దీనినిబట్టి అశ్రద్ధగా మందులు ఇచ్చిన దానివలన ఒక విధముగా నీదే తప్పుయగును. ఒకవేళ ఆమె గర్భస్రావమునకు తెలియని వేరే కారణమున్నా అది కనిపించదు, నీది కనిపించుచున్నది. కావున ఈ తప్పుకు నీదే బాధ్యతయని మేము అనుకొంటున్నాము. కావున మా తీర్పులో నీవే దోషిగా నిర్ణయింపబడుచున్నావు. నీ తప్పుకు తగిన శిక్షను మేము చెప్పడములో నీకేమయినా అభ్యంతరముంటే తెలుపవలసిందిగా చెప్పుచున్నాము.

**డాక్టరు :-** మీ తీర్పు ఏదయినా న్యాయసమ్మతముగా ఉండును. కనుక మీ తీర్పు మాకు ఆమోదయోగ్యమేయని తెలుపుచున్నాము.

**గ్రామపెద్ద :-** గతములో ఇటువంటి సమస్యలకు తీర్పు తీర్చిన అనుభవముతో ఇప్పుడు కూడా ఈ తీర్పును చెప్పుచున్నాను. గర్భస్రావము నకు గురి అయిన స్త్రీని, ఆమె గర్భస్రావమునకు కారణమైన డాక్టరుగారు ఈ దినమునుండి తన ఇంటిలోనే పెట్టుకొని, ఆమెకు కావలసిన సదుపాయము లన్నిటినీ సమకూర్చవలెను. తిరిగి ఆమె గర్భము ధరించి మూడు నెలలు గడచువరకు ఆమెను ఆమె ఇంటికి పంపకూడదు. అంతవరకు ఆమె వలన వచ్చు ఖర్చులన్నిటినీ డాక్టరుగారే భరించవలెను.

(ఆ తీర్పును వినిన కొందరు ప్రజలు తీర్పు సరియైనది కాదని తలచిరి. తర్వాత మరుసటి రోజు నుండి చాలామంది గ్రామ ప్రజలు గ్రామ పెద్దను బహిరంగముగా విమర్శించను మొదలుపెట్టారు. కొందరు గ్రామపెద్ద ఇచ్చిన తీర్పు ఎవరికీ ఆమోదయోగ్యము కాదని చెప్పను మొదలుపెట్టారు. అప్పుడు ఆ విమర్శలన్నిటినీ గమనించిన గ్రామపెద్ద, ఒక రోజు గ్రామ ప్రజలను అందరినీ సమావేశపరిచి క్రింది విధముగా మాట్లాడినాడు.)

**గ్రామపెద్ద :-** నేను గత కొన్ని సంవత్సరములుగా అనేక సమస్యలకు న్యాయ తీర్పును చెప్పాను. అప్పటినుండి ఇప్పటివరకు నన్ను, నా తీర్పును ఎందరో గౌరవించుచూ వచ్చారు. ఇప్పటివరకు అందరూ నన్ను మంచి న్యాయనిర్ణేత అని పొగడుచూ వచ్చారు. అయితే ఈ మధ్య కాలములో రెండు రోజుల క్రింద నేను చెప్పిన తీర్పును చాలామంది వ్యతిరేఖించడమే కాక, నన్ను దూషణగా మాట్లాడడము కూడా జరిగినది. నా వరకు నేను చెప్పిన తీర్పు పూర్తి న్యాయసమ్మతమైనదిగా ఉన్నది. అటువంటి తీర్పు మీకు ఎందుకు అన్యాయముగా కనిపించుచున్నదో చెప్పండి.

**(అప్పుడు గ్రామ ప్రజలలో ఒకరు బాగా మాట్లాడు వ్యక్తి లేచి ఇలా అన్నాడు)**

**ప్రజలు :-** ఇంతవరకు మీరు చెప్పిన తీర్పులన్నియూ అందరికీ ఆమోద యోగ్యముగా సక్రమముగా ఉన్నాయి. అయితే మొన్న ఇచ్చిన తీర్పులో అన్యాయము, అక్రమము ఉండుట వలన మాకు ఆమోదయోగ్యముగా లేదు. అందువలన అందరమూ వ్యతిరేఖిస్తున్నాము.

**గ్రామపెద్ద :-** నేను చెప్పిన ఈ తీర్పులో మీకు ఏమి అన్యాయము కనిపించినదో, ఏమి అక్రమము తెలిసినదో చెప్పండి.

**ప్రజలు :-** డాక్టరు మందు ఇవ్వడము వలన ఒక గర్భిణీకి గర్భస్రావమయితే దానికి తగిన పరిహారము డాక్టరుతో ఇప్పించివుంటే సరిపోయెడిది. అట్లు కాకుండా ఆమె తిరిగి గర్భము ధరించువరకు డాక్టరు వద్దనే పెట్టు కోమనడము తప్పుకాదా!

**గ్రామపెద్ద :-** ఒకవేళ డాక్టరు తప్పు చేసినందుకు కొంత డబ్బును పరిహారముగా చెల్లించమంటే, అతను చెల్లించిన డబ్బు అయిపోవులోపల ఆమె తిరిగి గర్భవతి కాకపోతే, నేను చెప్పిన పరిహారము తక్కువగును. ఒకవేళ డాక్టరు ఇచ్చిన డబ్బు అయిపోకముందే ఆమె గర్భవతి అయితే, డాక్టరుకు నేను ఎక్కువ పరిహారమును చెప్పినట్లగును. అందువలన ఫలితము కాలము మీద ఆధారపడియుండుట వలన, ఆమె తిరిగి గర్భము ధరించి మూడు నెలలు గడచువరకు జరుగు ఖర్చంతయూ డాక్టరుగారే భరించునట్లు చెప్పాను. ఇది ఎందుకు ఆమోదయోగ్యము కాదో చెప్పండి.

**ప్రజలు :-** డబ్బు పరిహార విషయములో నిన్ను మేము వ్యతిరేఖించడము లేదు. అమె గర్భవతి అగువరకు డాక్టరుగారివద్దనే పెట్టుకోమనడము తప్పని అంటున్నాము.

**గ్రామపెద్ద :-** ఇందులో తప్పేమివుందో మీరే చెప్పండి.

**ప్రజలు :-** ఏ స్త్రీ అయినా హిందూసమాజములో తనభర్త చేతనే గర్భము

ధరించాలి. మీరు డాక్టరుగారే ఆమెకు ధరింజేయవలెనని అనడము తప్పు కాదా?

**గ్రామపెద్ద :-** డాక్టరే ఆమె గర్భము వచ్చునట్లు చేయవలెనని నేను ఎక్కడా చెప్పలేదు కదా!

**ప్రజలు :-** గర్భము వచ్చువరకు డాక్టరు దగ్గరే పెట్టుకోమనడములో అర్థము అదే కదా!

**గ్రామపెద్ద :-** మీరు అలాగ ఎందుకు అనుకోవాలి? నేను చెప్పని విషయమును మీ ఇష్టానుసారము అనుకొంటే ఎలాగ?

**ప్రజలు :-** ఆమె తిరిగి గర్భవతి అయ్యేంతవరకు డాక్టరు వద్దనే ఉంచు కోవాలని మీరేగా చెప్పినది. డాక్టరు వద్దయున్నప్పుడు డాక్టరు వల్లనే గర్భము రావాలి కదా! భర్త లేకుండా గర్భము రావాలంటే అదే కదా! అర్థము.

**గ్రామపెద్ద :-** భర్త వలన కాకుండా డాక్టరుగారి వలననే గర్భము రావాలని నేను ఎక్కడయినా నా తీర్పులో చెప్పానా?

**ప్రజలు :-** ప్రత్యేకముగా చెప్పలేదు గానీ, ఆమె డాక్టరుగారి ఇంట్లో ఉంటే ఆమెకు గర్భము ఎలా వస్తుందో మీరే చెప్పండి?

**గ్రామపెద్ద :-** నేను నా తీర్పులో "డాక్టరుగారి ఇంట్లోనే ఆమెకు కావలసిన సదుపాయములన్నియూ కలుగజేయవలెను" అని చెప్పాను. అన్ని సదుపాయములని చెప్పినప్పుడే, ఆమె గర్భము ధరించుటకు భర్తను కూడా తనయొద్దనే పెట్టుకోమని చెప్పినట్లయినది. భర్తతో సహా అన్ని సదుపాయములను కలుగజేసి, గర్భము ధరించిన తర్వాత మూడు నెలల వరకు ఆమె ఖర్చు, ఆమె భర్త ఖర్చు రెండూ డాక్టరుగారే భరించునట్లు, అంతవరకు ఆమె వలన అయిన ఖర్చులన్నిటినీ డాక్టరుగారే భరించవలెనని

చెప్పాను కదా! నేను చెప్పు తీర్పులో ఆమె భర్త వలననే గర్భము ధరించునట్లు చెప్పానుగానీ, మీరనుకొన్నట్లు నేను చెప్పలేదు. నేను చెప్పని విషయమును మీరు అనుకోవడములో మీ తప్పేగానీ, నా తప్పు ఏమీ కాదు. సతీసావిత్రి సంతానమును అడిగినప్పుడు యమధర్మరాజు భర్తను కూడా ఇచ్చాడు కదా! ఇది అట్లే ఎందుకు అనుకోలేదు.

ఈ విధముగా చాలా విషయములలో చాలామంది తమ ఇష్టమొచ్చినట్లు అనుకొని ఎదుటివారిని తప్పు చేసినవారిగా చెప్పుచున్నారు. ఉదాహరణకు ఒక విషయమును చెప్పెదను చూడుము. ఒక రచయిత భగవద్గీత శ్లోకములకు వివరమును వ్రాసి దానికి **"త్రైత సిద్ధాంత భగవద్గీత"** అని పేరు పెట్టాడు. ఆయన తన గ్రంథములో భగవద్గీతలోని మొదటి అధ్యాయమైన అర్జున విషాదయోగమును వదలి రెండవ అధ్యాయమైన సాంఖ్యయోగములో 11వ శ్లోకమునుండి వివరమును వ్రాశాడు. ఆయన వ్రాసినది అలా ఉండగా మిగతా ప్రజలు ఇప్పుడు మీరెట్లు నన్ను అపార్థము చేసుకొన్నారో అదే విధముగా ఆయన "భగవద్గీత 18 అధ్యాయములు కాదు 17 అధ్యాయములే" అని చెప్పాడని అనుకొన్నారు. ఆయన భగవద్గీత 18 అధ్యాయములు లేదని 17 అధ్యాయములేనని ఎక్కడయినా చెప్పాడా? అలా ఎక్కడా చెప్పలేదు. "నేను ఇక్కడినుండి వ్రాస్తున్నాను" అని చెప్పాడు అంతేగానీ, ప్రత్యేకించి భగవద్గీత 17 అధ్యాయములేనని చెప్పలేదు. "అర్జునుడు చెప్పిన అధ్యాయమును చెప్పలేదు" అని వ్రాశాడు తప్ప భగవద్గీత 18 అధ్యాయములు కాదని ఎక్కడా చెప్పలేదు. ఇంకా మధ్యలో అక్కడక్కడ దాదాపు వంద (100) శ్లోకములకు భావము వ్రాయలేదు. "మనుషులకు అవసరమైనవి మాత్రము వ్రాయుచున్నాము. అవసరము లేనివి వ్రాయడము లేదని" కూడా చెప్పాడు. అక్కడ ఉన్న సత్యమును గ్రహించక ఆయన

చెప్పని మాటను హిందువులు ఆరోపించడము జరిగినది. అదే రచయిత ఖురాన్ గ్రంథమును వ్రాశాడు. ఖురాన్ ఆరువేల మూడు వందల ఆయత్‌లకు పైగా (వాక్యములకు పైగా) ఉండగా కేవలము రెండువందల వాక్యములకు మాత్రమే వివరము వ్రాశాడు. అలా వ్రాసిన గ్రంథమునకు **"అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు"** అని పేరు పెట్టడము జరిగినది. దానిని చూచిన ముస్లీమ్‌లు ఆ రచయిత మీద ఏ ఆరోపణ చేయలేదు. "ఆయనకు తెలిసిన వాక్యములకు వివరము వ్రాశాడు, తెలియని వాటికి వ్రాయలేదు" అని అనుకొన్నారు. ముస్లీమ్‌లు అలా అనుకోగా, వారు అనుకొన్నట్లు హిందువులు ఆయనకు తెలిసినవి మాత్రమే వ్రాశాడు, మిగతా వాటిని గురించి వ్రాయలేదని ఎందుకు అనుకోకూడదు? అట్లు అనుకోకుండా వారి ఇష్టమొచ్చినట్లు అనుకొని భగవద్గీత 18 అధ్యాయములు కాదు 17 అధ్యాయములే అని వారే చెప్పుచున్నారు తప్ప, ఆ మాటను రచయిత ఎక్కడా చెప్పలేదు కదా! ఇట్లు చాలామంది చాలాచోట్ల పొరపడి మాట్లాడడము జరుగుచుండును. దానిప్రకారమే ఇప్పుడు మీరు కూడా నేను చెప్పని తీర్పును నేను చెప్పినట్లు మాట్లాడుచున్నారు. ఏ విషయమైనా కొంత యోచించి మాట్లాడవలెనుగానీ, అట్లు కాకుండా తమ ఇష్టమొచ్చినట్లు మాట్లాడుతూపోతే అర్థాలన్నీ అపార్థాలయిపోగలవు. సత్యమంతా అసత్యముతో మూసివేయబడును. అప్పుడు ఉన్న సత్యము తెలియకుండా పోవును.

నేటి ప్రపంచములోని మనుషులకు ప్రపంచ జ్ఞానమే సరిగా అర్థము కావడములేదు. ప్రపంచ విషయములకంటే ఎన్నోరెట్లు పెద్దవయిన పరమాత్మ విషయములు సరిగా అర్థమగునని నమ్మకములేదు. అటువంటి స్థితిలో వారిని అనుసరించి వారికి అర్థమగు బోధలను చెప్పు వారిని

'జ్ఞాని' అని పొగడుచున్నారు. ప్రజలను అనుసరించకుండా వారికి సరిపోని ఎంత పెద్ద జ్ఞానమును చెప్పినా, దానిని గ్రహించని మనుషులు చెప్పిన వారిని అజ్ఞానులనడము జరుగుచున్నది. ఇదే పద్ధతి ప్రకారము ఒకే విషయమునే ఒక మతములో ఒక విధముగా, మరొక మతములో మరొక విధముగా అర్థము చేసుకోవడము వలన, ఒకే విషయమే ఒక మతములో ఒక భావముండగా, మరొక మతములో మరొక భావముతో యున్నది. భగవద్గీతలోని శ్లోకము యొక్క భావము హిందువులలోనే కొందరికి ఒక విధముగా, మరికొందరికి మరొక విధముగా అర్థమగుచున్నది. ***"కర్మణ్యే వాధికారస్తే"*** అను శ్లోకములో హిందూ గురువులందరికీ ఇట్లు అర్థమయినది. "పని చేయడములో అధికారమున్నది గానీ, ఫలితము మీద అధికారము లేదు" అని చెప్పారు. అయితే దాని వాస్తవ అర్థము ***"పని చేయడములో ఎవరికీ అధికారము లేదు, ఫలితము మీద అధికారము కలదని కలదు."*** వాస్తవ అర్థము కొద్దిమందికి మాత్రమే అరుదుగా అర్థమవగా, మిగతా వారందరికీ వేరు విధముగా అసత్య భావముతో అర్థమయినది. అయితే ఆ విషయము వారికి తెలియని దానివలన వారికి తెలిసినదే సత్యమనుకోవడము జరుగుచున్నది. ఇట్లు సత్యమునకు, అసత్యమునకు మనుషులలో భేదాభిప్రాయములు పుట్టుకొస్తున్నవి.

మనుషులలో వచ్చిన అభిప్రాయ భేదములు మతములలోనికి చొచ్చుకొని పోయి, మనుషులలో సామూహికముగా ఒకరిమీద మరొకరికి ద్వేషము పుట్టించుచున్నవి. ద్వేషము (అసూయ) వలన మనిషికి ఆగ్రహము వచ్చుచున్నది. "ఆగ్రహము" అనగా! గ్రహము లేనిదని అర్థము. గ్రహము లేనిదను అర్థమును పూర్తిగా తీసుకొంటే గ్రాహిత శక్తి లేనిదని అర్థమగును. గ్రాహిత శక్తిలేనప్పుడు అనగా! ఆగ్రహముతో మనిషియున్నప్పుడు అది

మనిషిని అధోగతికి తీసుకొనిపోవును. దానితోనే మనుషుల మధ్య, మతముల మధ్య ఘర్షణలు ఏర్పడుచున్నవి. దానితో మనుషులు ఉగ్రవాదులుగా మారుచున్నారు. మూడు మతములలో ఉగ్రవాదమున్నదని 1980 నుండి మేము చెప్పుచూనే యున్నాము. హిందూమతములో ఉగ్రవాదము లేదని హిందువులు ఒకవైపు అనుచున్నా, అది ఎవరికీ తెలియనట్లు కనిపించక యున్నది. ముస్లీమ్ మతములో బయటికి కనిపిస్తున్నది. క్రైస్తవ మతములో కూడా ఉగ్రవాదము కలదు. ఇతర మతములను హింసించు స్వభావము ఎక్కడున్నదో అక్కడ ఉగ్రవాదమున్నట్లే! మాది **"శాంతి మతము"** అను క్రైస్తవులు పైకి శాంతముగా కనిపించుచున్నా క్రైస్తవులలో కొందరు ఎవరికీ తెలియని, ఎవరూ గుర్తుపట్టని ఉగ్రవాదమును నడుపుచున్నారు. ఉగ్ర వాదమును మతములో యున్నవారందరూ చేయవలసిన పనిలేదు. ఒక మతములో కొందరు ఇతర మతముల యెడల కౄరత్వము కలిగిన ఆచరణలు చేసినట్లయితే చెడు పేరు మొత్తము ఆ మతమునకు వచ్చును. హిందువులలో నిత్యము వేదపారాయణ చేయు సాత్త్వికులు ఎందరున్నా, ఇతర మతముల మీద ద్వేషము కల్గి, క్రోధము ప్రకటించి, హింసా వృత్తిని చేయువారు కొందరున్నా, ఉగ్రవాదము అను పేరు మొత్తము హిందూ మతమునకు వస్తున్నది. అయితే హిందువులది ఒక విధముగా ఇతర మతముల మీద అసూయతో ఉగ్రవాదమున్నా, వారు గ్రుడ్డి ఉగ్రవాదమును నడుపుచున్నారు. కళ్ళు కనిపించని గ్రుడ్డిపాము తన పిల్లలను తానే తిన్నట్లు, హిందువులు తమ మతము వారినే పరాయి మతస్థులుగా భావించి, హిందూ మతము వారినే హింసించుచున్నారు. మేము ఈ విషయమును అనుభవ పూర్వకముగా చెప్పుచున్నాము. మేము హిందువులమై హిందూ గురువుగా యున్నా మా మీద హిందువులే ఎన్నోమార్లు దాడులకు పాల్పడినారు. మేము చెప్పు భగవద్గీతను సహితము పరమత బోధగా తలచిన గ్రుడ్డివారు

హిందువులలోయున్నారు. వారిని మన మతధర్మమేదో, పరమత ధర్మమేదో తారతమ్యము తెలియని అంధులని చెప్పవచ్చును. హిందూ ధర్మములను తెలియనివారు హిందువులలో ఉండుట వలన, స్వమత గురువుల మీదనే దాడులకు దిగుచున్నారు. హిందూమతములో ఉన్న పెద్దలోటు, పొరపాటు ఇదే అని చెప్పవచ్చును. హిందూ ధర్మములను తెలియనివారందరూ మేము హిందువులమని చెప్పుకోవడము వలన, రాజకీయ రంగు పూసుకొన్న వారు ఏమాత్రము జ్ఞానులు కాకున్నా మేము హిందూ రక్షకులని చెప్పుకోవడము వలన, హిందూమత క్షీణత ఏర్పడుచున్నదని అర్థమగుచున్నది. హిందూ గురువులు హిందూ మతవాదులకు భయపడి, ఆధ్యాత్మిక జ్ఞానమును చెప్పలేక పోవడము వలన, హిందూ ప్రజలు జ్ఞానము తెలియని స్థితిలో ఇతర మతములను ఆశ్రయించుచున్నారు. దానివలన హిందువులు ఇతర మతస్థులుగా మారిపోవుటకు హిందువులలోనున్న అజ్ఞానుల పనులే కారణమని చెప్పవచ్చును. అద్వైతమంటే, ద్వైతమంటే హిందువుల మత సిద్ధాంతమని కొందరనుచున్నా మేము ప్రతిపాదించిన త్రైత సిద్ధాంతమును పరమత మని అంటున్నారు. హిందూమతములోని సిద్ధాంతమును గుర్తించనివారు హిందువులని చెప్పుకోవడము వలన హిందూ మతము క్షీణించుచున్నదని, హిందువులు తమమీద తామే దాడిచేయడము వలన, హిందూమతములో బలమును చేకూర్చు గురువులను సహితము దూషించడము, దాడులు చేయడమువలన, హిందూమతములో హిందూ ధర్మములు తెలియని అరాచక శక్తుల నాయకత్వము వలన, హిందూ మతములో క్షీణత ఏర్పడుచున్నది. హిందూ మత క్షీణతకు హిందూమతము లోని గ్రుడ్డివాదము కూడా కొంత తోడయినదని చెప్పవచ్చును. ఉన్న సత్యమును చెప్పుటకు కూడా భయపడ వలసి వచ్చినది. ఇప్పుడు ఈ మాటలు వ్రాయుటకు కూడా ఎంతో ధైర్యము ఉండాలి. లేకపోతే ఇది

సత్యమని చెప్పుటకు కూడా వీలులేదు. అటువంటి భయానక స్థితి నేడు హిందూమతములో నెలకొని ఉన్నది.

కొందరు హిందూ నాయకులుగా యున్నవారు 'హిందూ ధర్మ రక్షణ' అను పేరును అడ్డము పెట్టుకుని నకిలీ ఉగ్రవాదులుగా ఉంటూ ఇతర హిందూ గురువులనే బాధించుచున్నారు. వేదాలనే గొప్పగా చెప్పాలని భగవద్గీతను చెప్పకూడదని బెదిరించుచున్నారు. గురువులు సహితము ఆధ్యాత్మిక సత్యములను బోధించకుండా మతవాదమునే బోధించమని, లేకపోతే తమ వలన తిప్పలు తప్పవని హెచ్చరికలు జారీ చేయుచున్నారు. హిందూమతములో మాలాంటి గురువులు సహితము స్వతంత్రముగా జ్ఞాన బోధ చెప్పుటకు వీలులేనందున, ధర్మముల గురించి బోధించు అవకాశము లేనందున, హిందూమతము నానాటికీ క్షీణించుచూ వచ్చుచున్నది. ఈ విధముగా మారిపోయిన హిందూమతములో గురువులు సహితము స్వంత సిద్ధాంతములు చెప్పుటకుగానీ, స్వంత బోధ చెప్పుటకుగానీ వీలులేని పరిస్థితి ఏర్పడినది. ముఖము మీద బొట్టుపెట్టుకోవడము ఒక్క హిందువులలోనే కలదు. అయినా తమకు ఇష్టములేని గుర్తును ముఖము మీద పెట్టుకొంటే వారిని పరమతము వారను పేరుపెట్టి హిందువులనే హింసించు హిందువులుండుట వలన నేను త్రైత సిద్ధాంతమును భగవద్గీతలోనిదని చెప్పినా, భగవద్గీతలో త్రైత సిద్ధాంతమును వర్ణించి చెప్పినా, భగవద్గీతను కూడా పరమతమునకు సంబంధించినదని దానిని బోధించు మమ్ములను హిందూ ముసుగులో యున్న క్రైస్తవ మత ప్రచారకులని అంటున్నారు. ఇటువంటి సమాజములో ఇమడలేని హిందువులు చాలామంది ఇతర మతములో చేరిపోవడము జరుగుచున్నది.

ఇతర మతములలోని ఉగ్రవాదులు వారి మతము అభివృద్ధికి ఇతర మతముల నాశనమునకు పనిచేయుచుండగా, హిందూ మతములోని

ఉగ్రవాదులు హిందూమతమును ఉద్ధరించుటకని చెప్పుకొనుచుండినా, వారి గ్రుడ్డి ఉగ్రవాదము వలన వారి పనులన్నియూ హిందూ మత క్షీణతకేనని తెలియుచున్నది. మేము అంతర్ముఖ ఆధ్యాత్మిక విషయములను, భగవద్గీత ఆధారముతో, భగవద్గీతలోని పురుషోత్తమ ప్రాప్తి యోగములోని 16, 17 శ్లోకముల ఆధారముతో మూడు ఆత్మల విషయమును చెప్పితే, మీరు రాముడు దేవుడని ఎందుకు చెప్పలేదని నాతో వాదమునకు దిగిన హిందూ రక్షణ వాదులు ఎందరో గలరు. సనాతనమైన వేదములను కాదని భగవద్గీతను ఎందుకు బోధిస్తున్నారని వేదముల గురించి ఎందుకు చెప్పడము లేదని నన్ను బెదిరించిన హిందూ నాయకులు గలరు. యజ్ఞయాగాదుల వలన దేవుడు తెలియబడడని భగవద్గీతలో విశ్వరూప సందర్శన యోగములో గల 48, 53వ శ్లోకములలో గల సారాంశమును చెప్పితే, మమ్ములను పరాయి మతస్థులుగా చిత్రించిన హిందువులు గలరు. భగవద్గీతలో ఉన్నదున్నట్లు చెప్పిన జ్ఞానమును వినినవారు కొందరు సంతోషపడగా, కొందరు మాత్రము సనాతన ధర్మములయిన వేదములను, పురాణాలను చెప్పకుండా వదలివేయువారు హిందువులే కాదని మా మీద ద్వేషపడు చున్నారు. చివరకు మమ్ములను ఇతర మతములకు చెందినవారిగా ప్రచారము చేసి, మామీద ఉగ్రవాదమును చూపు వారిని గ్రుడ్డి ఉగ్రవాదు లనక చూపున్నవారని చెప్పుటకు వీలులేదు. ఈ విధముగా హిందూ మతములోని ఉగ్రవాదము ఎవరికీ కనిపించనట్లున్నా బయటికి కొందరికి మరియు మాలాంటి వారికి బాగా తెలియుచున్నది. హిందూ ఉగ్రవాదులు ఇతర మతముల మీద దాడులు చేయకున్నా, తమ ద్వేషమును ఇతర మతముల మీద చూపకున్నా, తమ మతము మీదే ఎక్కువ వత్తిడి కల్గించు చున్నారు. ఈ విధముగా హిందూమతమునకు కొంత చెడునే కల్గించు ఉగ్ర వాదము హిందూమతములో గలదు. హిందూ మతములోని

ఉగ్రవాదము వలన ఈ మధ్య కాలములో చాలామంది గ్రంథకర్తలు, మంచి పేరుపొందిన రచయితలు, మాలాంటి గురువులు చాలామంది స్వమతములో అసంతృప్తి కల్గియున్నారు. మూఢనమ్మకమును ఖండించిన రచయితల మీద దాడులు కూడా జరిగినట్లు ఈ మధ్య కాలములో వార్తలు కూడా చాలా వచ్చాయి. ఇదంతా హిందూ మతములోని అజ్ఞానము వలననే జరుగుచున్నదనీ, ఇది స్వయంకృత అపరాధమే అని అంటున్నారు. దీనివలన హిందూమతమునకు నష్టమేగానీ, లాభము లేదని అంటున్నారు.

**ప్రశ్న :- హిందూ మతములోని అజ్ఞానమును దానివలన ఏర్పడిన ఉగ్ర వాదమును గురించి మీరు ఉన్నది ఉన్నట్లు చెప్పారు. అట్లు చెప్పుట వలన మత ఛాందసవాదులనుండి మీకు ఇబ్బందులే కల్గును కదా!**

**జవాబు :-** నేడు క్రొత్తగా వచ్చేవి ఏమీ లేవు. ఇంతకుముందే అన్ని ఇబ్బందులూ వచ్చాయి. మేము భగవద్గీతను అనుసరించి హిందూ ధర్మములను బోధించినా మమ్ములను దూషించడము జరిగినది. ***మేము దేవుడు దేవుని జ్ఞానమునకు తప్ప మనుషులకు భయపడము.***

**ప్రశ్న :- హిందువుల వలన ఎన్నో ఇబ్బందులు ఎదుర్కొనిన మీరు హిందూ మతమును వీడి ఎందుకు పోలేదు?**

**జవాబు :- "మతమార్పిడి దైవద్రోహము"** అని నేనే ఒక గ్రంథమును వ్రాశాను. దేవుడు పుట్టించిన మతమును వీడి వేరే మతములోనికి పోవడము మహాపాపమని చెప్పియున్నాము. అటువంటి నేను మతము మార్చు కోవడము అంటూ జరుగదు. నేను ఉన్నంతవరకు హిందూమతములోని కాలుష్యమును తీసివేసి హిందూమతమును స్వచ్ఛమయినదిగా, ఎంతో శక్తివంతమైనదిగా, ఎంతో జ్ఞానముతో కూడుకొనియున్నదిగా, ఇతర దేశములన్నియూ గుర్తించునట్లు చేయడమే ధ్యేయముగా పెట్టుకొన్నాను.

**ప్రశ్న :- మీరు హిందూమతములో ఉండి పరమతమును సమర్థిస్తారా? విమర్శిస్తారా?**

**జవాబు :-** ఏ మతములోనయినా దైవజ్ఞానమును సమర్థిస్తాను. అయితే ఆ మతములోనున్న అజ్ఞానమును విమర్శిస్తాను.

**ప్రశ్న :- కొందరు హిందువులు మీరు క్రైస్తవులకు అనుకూలురని, బైబిలు జ్ఞానమును ఎక్కువగా చెప్పుచుంటారని అంటుంటారు అది నిజమేనా?**

**జవాబు :-** నా విషయము ఏమాత్రము తెలియనివారు అట్లు అంటుంటారు. **"శిలువ దేవుడా?"** అను గ్రంథములో క్రైస్తవులందరూ ఆరాధించు శిలువను విమర్శించి వ్రాయడము జరిగినది. **"ఇందువు క్రైస్తవుడా?"** అను గ్రంథము కూడా వ్రాయడము జరిగినది. అందులో క్రైస్తవులను వ్యతిరేఖిస్తూ వ్రాసిన విషయమే ఎక్కువగాయున్నది. 'ఆదికాండము అబద్ధాల పుట్ట' అని చెప్పాను. అటువంటప్పుడు వారికి నేను అనుకూలమని ఎలా చెప్పగలరు? నేను ముందే చెప్పాను, మూడు మత గ్రంథములనబడునవి వాస్తవముగా మత గ్రంథములు కాదు. వాటియందు మతమను ప్రసక్తే లేదు. అందువలన వాటిని దైవగ్రంథములంటున్నాము. మత గ్రంథములని అనడము లేదు. భగవద్గీత ప్రథమ దైవగ్రంథముకాగా, బైబిలు ద్వితీయ దైవగ్రంథము. ఖురాన్ అంతిమ దైవగ్రంథమగుచున్నది. దైవగ్రంథములలో దేవుని జ్ఞానమేయున్నా వాటిలో కొంత అజ్ఞానమును కూడా మనుషులు కలుపుకొన్నారు. మేము మనుషులు కలుపుకొన్న అజ్ఞానమును వదలక విమర్శించుచున్నాము. అందులోయున్న జ్ఞానమును మాత్రము చూస్తున్నాము. అందువలన మేము ఏ గ్రంథములోని జ్ఞానమును కాదనడము లేదు. మూడు గ్రంథములలోని జ్ఞానము సృష్ట్యాదిలో దేవుడు చెప్పిన జ్ఞానమే అగుట వలన మూడు గ్రంథములను దైవగ్రంథములనియే నేను చెప్పుచున్నాను. నేను మూడు

మతములలోని ప్రజలకు వారివారి జ్ఞానమునే సరియైన పద్ధతిలో సరియైన భావముతో తెలియజేస్తున్నాను. ఏ మతములో అజ్ఞానమున్నా ఆ మతమును విమర్శించుచూ, వారిలోని అజ్ఞానమును జ్ఞానముగా మార్చుచున్నాము. ఏ మతములోని జ్ఞానమునయినా గౌరవించుచున్నాను.

**ప్రశ్న :- మీరు క్రైస్తవులకు వ్యతిరేఖముగా రెండు మూడు గ్రంథములను వ్రాసి వారికి సరియైన జ్ఞానమును చెప్పారని అంటున్నారు. అలాగే ముస్లీమ్‌ల గురించి వ్రాశారా?**

**జవాబు :-** నేను హిందువులలోని అజ్ఞానమును తీసివేయుటకు హిందువులను కూడా విమర్శించుచూ, ఎన్నో ప్రశ్నలను అడిగి చివరకు హిందువుల జ్ఞానము ఇంత గొప్పగాయున్నది చూడండి అని చెప్పాను. అలాగే క్రైస్తవులలోని తప్పులను బయటికి చూపి, వారికి వారి బైబిలులోని నాలుగు సువార్తలయందున్న జ్ఞానమే సరియైనదని చెప్పాను. ముస్లీమ్‌లకు ఖురాన్‌లో తెలియని ఎన్నో విషయములకు వివరమును అందించి ఖురాన్ వాక్యమును వారు ఎక్కడ తప్పుగా అర్థము చేసుకొన్నారో అక్కడ అది తప్పు, ఇది ఒప్పు అని అల్లా చెప్పిన జ్ఞానమును ప్రజలకు అందరికీ సులభముగా అర్థమగునట్లు చేశాము. నిజము నిష్ఠూరముతో కూడుకొని ఉండునని చెప్పినట్లు, మేము గ్రంథములోని సత్యమును వివరించి చెప్పినప్పుడు కొందరికి అది అర్థము కాకుండా పోవడము వలన మేము వారి దృష్ఠిలో చెడుగా కనిపించి యుండవచ్చును. ***ఇంతవరకు ఖురాన్ గ్రంథములోని వాక్యములకు జ్ఞాన వివరమును వ్రాసి ఖురాన్ గ్రంథములోని వాటి ఆయత్‌ల గొప్పతనమును ప్రజలకు తెలియజేసిన హిందూ గురువును నేను ఒక్కన్నేనని చెప్పుటకు గర్వపడుచున్నాను.*** ఆ విషయములో మేము వ్రాసినది చదవనివారు తప్ప ఎవరూ వ్యతిరేఖించలేదు. చదివిన వారందరూ మమ్ములను గొప్పగా పొగిడి చెప్పారు.

**ప్రశ్న :- ముస్లీమ్‌లలో కూడా ఉగ్రవాదమున్నదనీ, అది అందరికీ తెలిసిన ఉగ్రవాదమేననీ, ముస్లీమ్ ఉగ్రవాదులు ఎన్నో బాంబుదాడులు, ఆత్మాహుతి దాడులు చేసి ఎందరినో సంహరించినట్లు, ప్రతి నిత్యము వినే వార్తలలో తెలిసిపోవుచున్నది. దానిని గురించి మీరు ఏమంటున్నారు?**

**జవాబు :-** ముస్లీమ్‌లకు దేవుడు అంతిమ దైవగ్రంథమును ఇచ్చి అందులో ఎంతో జ్ఞానమును తెలిపాడు. అయినా అంది అందరికీ ఒకే విధముగా తెలియకపోవడము వలన, ముస్లీమ్‌లకు ఇతర మతములవారికి కొన్ని అభిప్రాయబేధములు ఏర్పడి చివరకు అవి అసూయగా మార్పుచెంది, ఉగ్రవాదమువైపు దారితీయుచున్నవి. అటువంటి వారు కూడా మాకు తగిలారు. మా అనుభవములో ఉగ్రవాద భావమున్న వారిని చూచాము. ఎక్కడయితే అజ్ఞానమున్నదో అక్కడ ఉగ్రవాద భావములు పెరిగిపోవుచున్నవి. ఉగ్రవాదము ఒక మతమునకు పరిమితమైనది కాదనీ, మనిషిలోయున్న జ్ఞానమునుబట్టి మతములతో ప్రమేయము లేకుండా అన్నిచోట్ల అన్ని మతములలో పెరిగిపోయినా, కొన్ని మతములలో నివురుకప్పిన నిప్పులాగ ఉన్నది. కొన్ని మతములలో ముందే నిప్పులాగ బయటికి కనిపించుచున్నది. బహుశా కొందరు ముస్లీమ్‌లు కొన్ని దేశములలో మండే అగ్నిలాగ చెలరేగి పోయి హింసను సృష్టిస్తున్నది వాస్తవమే. అయితే భారత దేశములోనున్న ముస్లీమ్‌లందరూ అలాగే ఉండరు కదా! కొందరు జ్ఞానము తెలిసిన వారు ఎంతో సౌమ్యముగా ఉన్నారు. జ్ఞానము తెలియనివారితోనే ఉగ్రవాద సమస్య ఉందని చెప్పవచ్చును. అటువంటి వారు అప్పుడప్పుడు మాకు తటస్థ పడడము జరిగినది. అయితే మాతో ముఖాముఖి మాట్లాడినవారు తాము చేయుచున్నది తప్పని తెలుసుకోగలిగి, మమ్ములను గౌరవముతో మాట్లాడించి పోయిన వారు గలరు.

మమ్ములను ఎక్కడా చూడనివారు మమ్ములను తప్పుగా భావించుకొని, మామీద అసూయను పెంచుకొన్నవారు కొన్ని సందర్భములలో మమ్ములను బెదిరించడము కూడా జరిగినది. ఫోన్‌కనెక్షన్‌లో మాట్లాడిన వారు ఎవరో తెలియకపోయినా, వారి మాటలనుబట్టి వారు ఉగ్రవాద భావములున్నవారని తెలియుచున్నది. మా హిట్‌లిస్టులోనికి నిన్ను చేర్చుకొంటున్నామని ఒకరు చెప్పగా, మరొకరు నిన్ను టార్గెట్ చేయుచున్నామని చెప్పినవారు కూడా కలరు. వారితో నేను మాట్లాడినప్పుడు వారి అడ్రస్ లేకుండా మాట్లాడడము జరిగింది. వారు మాట్లాడినందుకు నేను వారిని అడిగిన మాటలను క్రింద చూడండి.

**ఉగ్రవాది :-** నిన్ను టార్గెట్ చేస్తున్నాము. ఇక నీ చాప్టర్ ముగిసిపోయింది.

**నేను :-** ప్రతి మనిషి జీవితము ఎప్పుడో ఒకప్పుడు ముగిసిపోక తప్పదు. మీరెందుకు నా చాప్టర్ ముగించాలనుకొంటున్నారు? దేశములో ఎంతోమంది స్వామీజీలు ఉండగా, అంతమందిని కాదని మీ దృష్టి నా మీదికి ఎందుకు వచ్చినది? నన్ను టార్గెట్ చేయాల్సిన అవసరమేమొచ్చినది?

**ఉగ్రవాది :-** మిగతా స్వామీజీలందరు వారి మత బోధలు వారు చెప్పుకొంటున్నారు. మీరు అట్లుకాకుండా మా మతములోని బోధలను కూడా చెప్పుచున్నారు.

**నేను :-** మిగతా స్వామీజీలందరూ మతద్వేషము కల్గి పరమతమని, ఇతర మతముల జోలికి పోకుండా, తమ మతమును గురించి మాత్రమే చెప్పుకొనుచుందురు. నేను అట్లుకాకుండా అన్ని మతములు సమానమేనని, అన్ని దైవగ్రంథముల విషయములు అన్ని మతములవారికి తెలియవలెనని, ముస్లీమ్‌లు మాగ్రంథమని చెప్పుకొను ఖురాన్ గ్రంథమును గురించి తెలుగు

భాషలో నేను **"అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు"** అను పేరుతో వ్రాయడము వలన, నన్ను అనుసరించి హిందువులు దాదాపు పదివేల మంది ఖురాన్ గ్రంథమును చదువగలిగి అందులోని జ్ఞానమును తెలుసు కోగలిగారు. అట్లే నేను వ్రాసిన గ్రంథమును చదివి ముస్లీమ్‌లు కూడా ఇంతవరకు మాకు తెలియని రహస్యములెన్నో ఈ గ్రంథములో తెలిశాయని సంతోషపడుచున్నారు. దానివలన ముస్లీమ్‌లదే ఖురాన్ గ్రంథమను అసూయ పోయి, మన అందరిదీ ఖురాన్ గ్రంథమని మిగతా మతముల వారందరూ అంటున్నారు. నేను ఒక ఖురాన్ గ్రంథమునే కాక, మూడు మతముల వారు చెప్పుకొను మూడు గ్రంథములను వివరించి వ్రాశాను. దానివలన మూడు గ్రంథములలోని జ్ఞానము ప్రజలందరికీ తెలిసిపోయి దేవుడు అందరికీ ఒక్కడే, గ్రంథములోని జ్ఞానము ఒక్కటేయను భావము లోనికి వచ్చి మతద్వేషములను వదలి మత సామరస్యముగా ఉంటున్నారు. ఇందులో మీకు కనిపించిన చెడు ఏమిటో చెప్పండి. నేను చేసిన దానిలో కొద్దిమాత్రము చెడుయున్నా మీరు నన్ను టార్గెట్ చేయడములో ఏమాత్రము తప్పు ఉండదు. మీకు కనిపించిన తప్పేమిటో చెప్పండి.

**ఉగ్రవాది :-** మీరు మాకు సరిపోని విషయమును వ్రాశారు.

**నేను :-** మేము ఎక్కడ వ్రాసినా శాస్త్రబద్ధమైన విషయమునే, సత్యమైన విషయమునే, గ్రంథములలో దేవుడు చెప్పిన విషయమునే వ్రాసియుంటాము. అంతేతప్ప తప్పుగాయున్న విషయమునుగానీ, దేవుడు చెప్పని విషయమును గానీ, అసత్య విషయమునుగానీ ఎప్పుడూ ఎక్కడా చెప్పలేదు. మీకు సరిపోని విషయమేదో చెప్పండి.

**ఉగ్రవాది :-** మీరు తౌరాత్ గ్రంథమును భగవద్గీతయని చెప్పుచున్నారు. మూసా ప్రవక్త శ్రీకృష్ణుడు ఒకటేయని చెప్పుచున్నారు. మీరు ఏ ఆధారముతో అలా చెప్పుచున్నారు? ఈ విషయములో మేము పూర్తి వ్యతిరేఖిస్తున్నాము.

**నేను :-** నేను చెప్పినది తౌరాత్ గ్రంథమును గురించి చెప్పుచూ, తౌరాత్ గ్రంథములోని జ్ఞానమే భగవద్గీతలోయున్నది. అందువలన తౌరాత్ భగవద్గీత రెండూ ఒక్కటేనని చెప్పాను. అంతేకాక మూసా ప్రవక్త, కృష్ణుడు ఇద్దరూ ఒక్కటేయని చెప్పాము. ఇంతవరకు ఈ విషయమును ఎవరూ ఎక్కడా చెప్పలేదు. అందువలన మేము చెప్పినప్పుడు ఈ విషయము పూర్తి క్రొత్తగా కనిపించుచున్నది. సరే! మీరన్నట్లు నేను చెప్పినది తప్పే అనుకుందాము. తౌరాత్ గ్రంథమంటే మీ దృష్ఠిలో ఏదనుకుంటున్నారు? మీరు ఎప్పుడయినా ఆ గ్రంథమును చూచారా? అది ఏ భాషలో వ్రాయబడినదో తెలుసా? దాని గ్రంథకర్త ఎవరో తెలుసా? మూసా ప్రవక్తనే ఆ గ్రంథమును వ్రాశాడని అందరూ చెప్పుచున్నారు. వాస్తవముగా మూసా ప్రవక్త ఆ గ్రంథమును వ్రాశాడని ఎవరయినా ధైర్యముగా చెప్పగలరా? తౌరాత్ అనునది భగవద్గీత కాదని చెప్పుటకు ఎవరివద్దయినా ఆధారమున్నదా? తౌరాత్ అంటే భగవద్గీత కాదని మీరు చెప్పగలరా? ఇన్ని ప్రశ్నలకు జవాబు మీ వద్ద యున్నదా?

**ఉగ్రవాది :-** తౌరాత్ అంటే భగవద్గీత యని మీరే వ్రాశారు. అందువలన మీరే అది ఎలాగ భగవద్గీత అయినదో చెప్పండి. తౌరాత్ అంటే ఖురాన్‌కంటే, బైబిల్‌కంటే ముందువచ్చిన గ్రంథమని అంటున్నాము.

**నేను :-** మీరు చెప్పినట్లు బైబిలు (ఇంజీలు), ఖురాన్ గ్రంథములకంటే ముందు వచ్చిన గ్రంథము తౌరాత్ అనునది వాస్తవమే! అదే విషయమునే మేము కూడా చెప్పుచున్నాము. తౌరాత్ అంటే ఏమిటో దాని పేరులో గల వివరమేమిటో ఇంతకుముందు వ్రాసిన **"అంతిమ దైవగ్రంథములో జ్ఞాన వాక్యములు"** అను గ్రంథమునందు వివరించి చెప్పాము. అక్కడ తౌరాత్ అను పేరుకు మాత్రము అర్థమును చెప్పాము. అట్లే మూసాను గురించి కూడా కొద్దిగా చెప్పాము. తౌరాత్ అంటే భగవద్గీతయేనని పూర్తి వివరముగా

అందరికీ అర్థమగులాగున, అందరి ప్రశ్నలకు జవాబు ఉండులాగున మేము వ్రాయబోయే గ్రంథమయిన **"అంతిమ దైవగ్రంథములో జ్ఞాన వాక్యములు రెండవ భాగములో"** వ్రాయతలచాము. మొదటి భాగములో ఇప్పటికే చాలా సమాచారమును దానిపేరులోనే ఉన్నట్లు వ్రాశాము. మీరు గ్రంథమును చదివితే ఆ విషయము కొంతయినా అవగాహనకు రాగలదు.

**ఉగ్రవాది :-** మీరు వ్రాసిన గ్రంథమును మేము చదవము. అసలు మా గ్రంథమును గురించి వ్రాయుటకు మీరెవరు? మా గ్రంథములో చేయి పెట్టడమే పెద్దతప్పు.

**నేను :-** మీరు ఈ మాట మాట్లాడడమే పెద్దతప్పని నేను చెప్పుచున్నాను. ఇతరుల తప్పును ఎంచేముందు కొంత ఆలోచించి మాట్లాడడము మంచిది. ఖురాన్ మా గ్రంథము అనడము మీదే తప్పగును. ఖురాన్ గ్రంథము ఒక్క ముస్లీమ్ మతమువారిదని గ్రంథములో ఎక్కడా చెప్పలేదు. అంతేకాక మతప్రసక్తి ఆ గ్రంథములో లేనే లేదు. ఖురాన్ దైవగ్రంథము, సర్వ మానవులకు సంబంధించినది. ఆ విషయము ఖురాన్ గ్రంథములో సూరా 81, ఆయత్ 27లో ఇలా వ్రాశారు చూడండి. **(81-27) "ఇది సమస్త లోకవాసులకొరకు హితోపదేశము. (14-52) "ఈ ఖురాన్ సమస్త మానవులకొరకు ఒక సందేశము. తద్వారా వారిని హెచ్చరించటానికి, దేవుడు ఒక్కడే ఆరాధ్యదైవమని వారు గ్రహించటానికి ఇది పంపబడినది."** ఈ విధముగా ఖురాన్‌లోనే సమస్త మానవులకు అని చెప్పియుంటే, ఖురాన్ మా గ్రంథమని మీరనడములో అర్థమే లేదు. మా గ్రంథము అని ఎవరయితే అన్నారో వారు దైవగ్రంథమయిన ఖురాన్‌కే వ్యతిరేఖముగా మాట్లాడినట్లగును. ఈ మాటకు మీరు దేవుని ముందర సమాధానము చెప్పవలసి యుంటుంది.

ఖురాన్ గ్రంథము మీకెంత గొప్పదో మాకూ అంతే గొప్పది. అందువలన ఖురాన్‌ను అందరూ గౌరవించునట్లు, అందరికీ అందులోని విషయములు తెలియునట్లు మేము వ్రాశాము. మేము వ్రాయుట వలన ఎందరో చదువగలిగారు. హిందువుల గ్రంథములుగా చెప్పుచున్న భగవద్గీతను, వేదములను, ఉపనిషత్తులను, పురాణములను గురించి చాలామంది ముస్లీమ్ వక్తలు తమ ఉపన్యాసములలో సంస్కృత శ్లోకములతో సహా చెప్పుచుందురు. అట్లే ముస్లీమ్ పండితులు భగవద్గీతను, వేదములను వాటిలోని విషయములను కొన్ని పుస్తకములలో వ్రాయడము జరిగినది. అప్పుడు హిందువులు ఎవరూ ఇవి మా గ్రంథములు వీటిని మీరెందుకు వ్రాశారని అడుగలేదు కదా! అలా వ్రాయుట వలన మత సామరస్యము ఏర్పడును. ఒకరికొకరు అర్థము చేసుకొనుటకు, ఒకరినొకరు కలిసి మెలిసి తిరుగుటకు అవకాశము గలదు. ఇటువంటి మంచి పనిని చెడుగా చెప్పడము, తప్పు అని చెప్పడములో మీ ఉద్దేశ్యమేమో మాకు తెలియదు.

**ఉగ్రవాది :-** మీరు చెప్పేది మేము వినదలచుకోలేదు. మీరు వ్రాసేది మేము చదువదలచుకోలేదు. మీ మీద మేము ఒక కన్ను పెట్టుకొన్నామని మరువకండి.

**నేను :-** నీవు దేవుడని చెప్పే అల్లాకు తెలియకుండా ప్రపంచములో ఏమీ జరుగదు. అల్లాహ్ ఆజ్ఞ లేనిది ఏమీ జరుగదు. మీకు, నాకు అందరికీ పెద్ద అల్లాహ్. ఆయన ఏమి అనుకుంటే అది జరుగుతుంది. మనిషి స్వయముగా ఏమీ చేయలేడని ఖురాన్ గ్రంథములో 18వ సూరాలో 23వ ఆయత్‌నందు ఇలా చెప్పారు చూడు. **(18-23) "ఏ విషయములో కూడా నేను రేపు ఈ పనిని చేస్తానని చెప్పకు. నీవు ఏమీ చేయలేవు"** అని కలదు. దీనిప్రకారము ఏ మానవుడు దేనినీ స్వయముగా చేయలేడని

తెలియుచున్నది. దేవునికి ఇష్టమైనప్పుడే ఏ పనియైనా జరుగగలదు. దేవుని ఇష్టములో నేను బ్రతుకకూడదు అని ఉంటే, ఆ తీర్పును శిరసా ఎవరయినా ఒప్పు కోవలసిందే. దేవునికి ఇష్టము లేనిదానిని ఏ మానవుడు చేయలేడు. అటువంటప్పుడు నీవు ఏదో అన్నావని నేనెందుకు ఉలికిపడాలి! "సర్వ కార్యాచరణ చేయించువాడు దేవుడే!" అని తెలిసినప్పుడు అందరూ దేవునికే భయపడాలిగానీ మనుషులకు భయపడకూడదు. అలా భయపడితే అది అజ్ఞానమగును. అధర్మమగును దానినే పరధర్మమని కూడా అంటారు. ఈ విషయమై ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో కర్మయోగమను అధ్యాయమునందు 35వ శ్లోకములో ఇలా చెప్పారు చూడండి.

*శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।*
*స్వధర్మేనిధనం శ్రేయః పరధర్మోభయావహః ॥*

భావము : **"గుణము లేని స్వంత ధర్మమే శ్రేష్టమైనది. అన్య ధర్మము (పరధర్మము) ఎంత ఆచరణ యోగ్యముగాయున్నా, పరధర్మములోని భయము కంటే స్వధర్మములో మరణమైననూ మేలే"** అని చెప్పబడియున్నది. అజ్ఞానములో భయముతో బ్రతుకుటకంటే, జ్ఞానములో అనగా ఆత్మధర్మములో మరణమే మేలని దేవుడే గీతయందు చెప్పాడు. దైవజ్ఞానమును తెలిసిన మనిషిగా నాకు భయము లేదు. **స్వచ్ఛమయిన దైవజ్ఞానమును ప్రకటించుటే నా జీవిత ధ్యేయము.** అలాంటప్పుడు నాకర్తవ్యమును ఎవరూ ఆపలేరు. నాకు మూడు మతములు ఒక్కటే. మూడు మత గ్రంథములలో చెప్పిన జ్ఞానము ఒక్కటే. మూడు దైవగ్రంథములలో ఒక్కడే దేవుడు కనిపించుట వలన, మా వద్ద వేరు మతములేదు, వేరు దేవుడు లేడు. అందరమూ మనుషులమే అందరికీ దేవుడు ఒక్కడే.

ఈ విధముగా ఎందరో ముస్లీమ్‌లనుండి బెదిరింపులు వచ్చినా నేను నేనుగానే యున్నాను. నా పని నాపనిగానే యున్నది. గత నలభై (40) సంవత్సరములనుండి జ్ఞానమార్గములో మేము ఎన్నో ఆటుపోట్లు ఎదుర్కొంటున్నాము. ఇవన్నియూ మనిషి జీవితములో సహజమేనని మాకు తెలుసు. అందువలన అటువంటి బెదిరింపుల ద్వారా మేము దైవ కార్యములను చేయకుండా మానుకోలేదు. అయితే ముఖ్యముగా చెప్పవలసిన విషయము ఏమంటే! ముస్లీమ్‌లు ఎక్కువగా బెదిరించారు. అయితే వారి వలన ఎటువంటి నష్టముగానీ, కష్టముగానీ జరుగలేదు. మాకు జరిగినదంతా హిందువుల వలన ఎక్కువ కష్టనష్టములు జరిగాయి. మమ్ములను హిందువులని చూడకుండా, పరమతమను సాకును చూపుతూ మామీద (మా అనుచరులమీద) కేసులు పెట్టారు, దాడులు చేశారు. ముస్లీమ్‌లు అటువంటి పనిని ఎక్కడా చేయలేదు. పైగా తెలియనప్పుడు మమ్ములను వ్యతిరేఖించి మాట్లాడినా, మా జ్ఞానము తెలిసిన తర్వాత మా యెడల గౌరవమును ప్రదర్శించారు. అన్యమతమైన ముస్లీమ్‌లు మా జ్ఞానమును తెలుసుకొనుటకు ఆసక్తి చూపుచుండగా, నేటికీ హిందూ సమాజములో నాయకులమనువారు ఏమాత్రము జ్ఞానములేనివారై మమ్ములను వ్యతిరేఖిస్తున్నారు. అనంతపురం జిల్లా, గుంతకల్లు పట్టణమునుండి ఆరు, ఏడుమంది ముస్లీమ్ యువకులు మా జ్ఞానమును తెలియుటకు ప్రతి పౌర్ణమి సమావేశమునకు రావడము జరుగుచుండగా, అక్కడనుండి ఒక్క హిందువు కూడా రాలేదు మేము చెప్పు జ్ఞానమేమి అని తెలియుటకు ప్రయత్నము కూడా చేయలేదు. అదే గుంతకల్లు పట్టణములో భగవద్గీత అని పేరును చూచయినా భయపడక, మేము వ్రాసిన "త్రైత సిద్ధాంత భగవద్గీత"ను క్రైస్తవులదని చించివేయడము, కాల్చివేయడము జరిగినది. ఇదంతా చూస్తే కనిపించే ఉగ్రవాదమున్న ముస్లీమ్‌లే జ్ఞానమును తెలియడములో ముందున్నారని తెలియుచున్నది.

మా అనుభవములో హిందువులలోయున్న మతద్వేషమును, ముస్లీమ్‌లలోయున్న మతద్వేషమును చూచాము. ఇందులో నేను హిందువుగా యున్నా హిందువులు నా మీద చూపిన మతద్వేషమును చెప్పాను. హిందువుల మీద ముస్లీమ్‌లకున్నది కూడా చెప్పాను. ఇక క్రైస్తవులు ఎట్లు వారి మతద్వేషమును చూపుచున్నారో కొంత నా అనుభవములోని విషయమునే చెప్పగలను.

**ప్రశ్న :- హిందువులు మీపట్ల చూపిన ద్వేషమును గురించి చెప్పారు. అయితే హిందువులు క్రైస్తవులపట్ల ఎట్లున్నారో, ముస్లీమ్‌ల ఎడల ఎట్లున్నారో చెప్పగలరా?**

**జవాబు :-** నేను చూచినది చెప్పగలను. హిందువులు మిగతా రెండు మతముల ఎడల మతద్వేషము కల్గియుండడము వాస్తవమే అయినా, క్రైస్తవుల మీదికి పోయినట్లు ముస్లీమ్‌ల మీదికి పోవడము లేదు. ఒకవేళ ఎక్కడయినా ముస్లీమ్‌ల మీద దాడిచేసినా, వారు వెంటనే హిందువులమీద దాడి చేయడమో, లేక అంతకంటే ఎక్కువగా బాంబులు పేల్చి హింసను సృష్టించడమో జరుగుచుండును. అందువలన హిందువులు ఎక్కువగా ముస్లీమ్‌ల జోలికి పోరు. నేను చూచినంతటిలో క్రైస్తవుల మీదికే ఎక్కువగా దాడిచేయడము, వారిని భయపడునట్లు చేయడము, వారి ప్రార్థనలను, సభలను భంగము చేయడము జరుగుచుండును. ముస్లీమ్‌లు మదరసాలు పెట్టి వారి మతబోధనలను బోధించుచున్నా, వారి జోలికి పోని హిందువులు, ఎక్కువగా క్రైస్తవుల జోలికి పోవడము జరుగుచున్నది. అన్నిచోట్ల హిందువులదే పై చేయిగా కనిపించుచున్నది. క్రైస్తవులు ముస్లీమ్‌లవలె ప్రతిదాడులు చేయరు. పైకి మాది శాంతిమతము అని చెప్పుకొనుచూ మౌనముగాయున్నా, లోలోపల వారి బుద్ధిని ఉపయోగించి హిందువులను

దెబ్బతీయుచుందురు. వారి కార్యాచరణ బయటికి తెలియదుగానీ, వారిలో కూడా మతద్వేషము ఏమీ తక్కువ లేకుండాయున్నది. ముందు నాకు తెలిసిన విషయమును వివరిస్తాను. అందులో హిందువులు క్రైస్తవుల ఎడల ఎట్లున్నారో తెలియగలదు.

నేను 2006వ సంవత్సరము కాకినాడకు పోవడము జరిగినది. అక్కడ ఒక లాడ్జిలో ఉండగా, నాకు పరిచయమున్న వ్యక్తి నేను అక్కడున్న విషయము తెలిసి, ఆయనకు పరిచయమున్న కొందరికి ప్రబోధానంద గురువుగారు వచ్చారని చెప్పడము జరిగినది. నేను ఎక్కడకు పోయినా నన్ను ఎవరూ గుర్తించలేరు. నేను సర్వసాధారణముగా అందరున్న దుస్తులలో ఉండుట వలన ప్రత్యేకమయిన దుస్తులు, ప్రత్యేకమయిన అలంకరణ లేని దానివలన, నన్ను జ్ఞానము తెలిసిన మనిషి అనికూడా అనుకోరు. అయితే నా గ్రంథములు చదివిన వ్యక్తి నన్ను గుర్తించి నేను అక్కడికి పోయిన విషయమును అతనికి పరిచయమున్న హిందూ సమాజములో "మేము పెద్దలము" అను వారితో చెప్పగా! వారు దాదాపు పదిమంది మావద్దకు వచ్చి కలువడము జరిగినది. అప్పుడు నేను ఏమీ మాట్లాడక ఊరకనే వారి పరిచయమును విని ఊరకున్నాను. మాట్లాడే అవకాశము వారికే ఇచ్చాను. వారు హిందుత్వమును మేము కాపాడు చున్నాము, లేకపోతే ఇక్కడ ఎక్కువగా హిందువులందరూ క్రైస్తవులుగా మారిపోయేవారని చెప్పను మొదలుపెట్టారు. వారు చెప్పేమాటలకు మధ్యలో అప్పుడప్పుడు నేను కూడా మాట్లాడవలసిన పని ఏర్పడినది. మాట్లాడకపోతే మేము చెప్పే విషయముమీద ఈయనకు ఆసక్తి లేదని అనుకోగలరు. అందువలన అప్పుడప్పుడు కొన్ని విషయములను అడుగవలసి వచ్చినది. వారి సంభాషణ క్రింది విధముగా సాగినది చూడండి.

**ఒక వ్యక్తి :-** ఇక్కడ కాకినాడలో హిందూ సమాజములో నేను పట్టణ నాయకుడను. ఇక్కడ క్రైస్తవులు చాలామంది హిందువులను వారి మతము లోనికి మార్చుకొన్నారు. దానికి అడ్డుకట్టవేయుటకు క్రైస్తవులు ఎక్కడ బోధలు చెప్పుచున్నా, వారు ఎక్కడ స్వస్థత సభలు చేయుచున్నా, వారిమీద దాడిచేసి వారిని అక్కడినుండి తరిమికొట్టే పనిని గత మూడు సంవత్సరముల నుండి చేయుచున్నాము. మేము ఒక సంఘముగా ఏర్పడి ఇంకా కొందరిని తయారుచేసి క్రైస్తవుల ఫాదర్‌లమీద, పాస్టర్‌ల మీద దాడిచేయడము వలన, వారి సభలు సమావేశములు లేకుండా చేయడము వలన, వారి ప్రచారము తగ్గిపోయినది. ఇప్పుడు హిందువులు క్రైస్తవులుగా మారిపోవడము కూడా తగ్గిపోయినది. మేము ఈ కార్యములు చేయకపోతే హిందూమతమునకు పెద్దనష్టము ఏర్పడేది.

**నేను :-** దాడులు చేయడము వలన మతప్రచారము పైకి కనిపించక పోవచ్చును. వారిలో ఉద్దేశ్యమునకు ఇంకా బలము చేకూరి మీకు తెలియ కుండా మతమార్పిడులు చేయగలరు కదా!

**రెండవ వ్యక్తి :-** అలా జరుగకూడదనే ఫాదర్లను, పాస్టర్లను చాలావరకు భయపెట్టాము. కొన్నిచోట్ల నిర్బంధించి మీ క్రైస్తవమతముకంటే మా హిందూ మతము గొప్పదని చెప్పాము. ఎక్కడా మతప్రచారము చేయమని ప్రమాణము చేయించుకొని వదలిపెట్టాము. ఇక్కడ ఓడరేవు ఉండుట వలన విదేశీ ప్రచారకులు కూడావచ్చి, విచ్చల విడిగా డబ్బులు ఇచ్చి, మతమార్పిడి చేయడము జరుగుచున్నది. అందువలన ఎవరయినా విదేశీ బోధకులు వచ్చినా, వారిని ఇక్కడ ఉండకుండా తరిమివేయుచున్నాము. మేము మా పనులు వదలిపెట్టి అదే పనిగా తిరుగుచుండుట వలన మా ప్రాంతములో మతమార్పిడిలు తగ్గాయి.

**మూడవ వ్యక్తి :-** నేను, కొంతమంది కలిసి ఒక పాస్టర్‌ను మూడు రోజులు కాళ్ళు, చేతులు కట్టివేసి బంధించిపెట్టి మూడురోజుల తర్వాత ఎప్పటికీ క్రైస్తవ ప్రచారము చేయనని ఒప్పించుకొని పంపినాము.

**నేను :-** మీరు చేసినది మీవరకు గొప్పదే! అది నాగరిక సమాజములో గొప్పదికాదు. బంధించడము వలన, హింసించడము వలన ఎవరు ఎవరినీ మార్చలేరు. మీరు మూడు రోజులు బంధించి వదలిన పాస్టర్ తిరిగి ప్రచారము చేయడని మీరు ఎలా నమ్మగలుగుచున్నారు?

**మూడవ వ్యక్తి :-** అవును! మీరు చెప్పేమాట వాస్తవమే అయినది. అదే పాస్టరే మరియొక చోట ప్రచారము చేయుచూ కనిపించాడు. మేము మూడు రోజులు బంధించి చెప్పినా, తిరిగి అతను తన పనిని తాను చేయుచున్నాడు.

**నేను :-** హిందువులు క్రైస్తవులుగా మారిపోవుచున్నారని, ఇదంతయూ క్రైస్తవ ప్రచారకుల వలననే జరుగుచున్నదని మీరు అంటున్నారు. హిందూ మతము తగ్గిపోకుండుటకు, మతమార్పిడి జరుగకుండుటకు, వారు చేసినట్లు మీరు కూడా హిందూమతమును గురించి ప్రచారము చేయవచ్చును కదా! హిందూమతమును గురించి ఏమాత్రము ప్రచారము చేయకుండా, క్రైస్తవుల మీద దాడిచేసి మతమార్పిడిలు ఆపాలంటే, అరచేయి అడ్డము పెట్టి సూర్యున్ని పట్టుకున్నానన్నట్లుంటుంది. అరచేతితో సూర్యున్ని ఎలా పట్టుకోలేమో! అలాగే దాడుల వలన మతప్రచారమును ఆపలేము. వారి మతమును గురించి వారు ప్రచారము చేసినట్లు, మీ మతమును గురించి మీరు ప్రచారము చేయవచ్చును కదా! క్రైస్తవులుగా మారిన హిందువులను నేను పలకరించి, మీరు క్రైస్తవులుగా ఎందుకు మారినారు? అని అడిగితే దానికి వారు "మాకు హిందూమతములో దేవుడు ఎవరో తెలియదు. అంతేకాక

హిందువుల జ్ఞానమేదో తెలియదు, హిందువుల గ్రంథము ఫలానా అనికూడా తెలియదు. కొందరు వేదాలు అంటారు, కొందరు పురాణాలు అంటారు. కొందరు భగవద్గీత అంటున్నారు. దేనిని నమ్మాలో తెలియలేదు. దేవుని విషయములో కొందరు రాముడంటారు, కొందరు రంగడంటారు, కొందరు ఆదిశక్తి కాళికాదేవని అంటారు. దేనినీ సరిగా చెప్పువారు లేరు. పైగా హిందువులలో పెద్ద, చిన్న కులములని మాలాంటి వారిని అవమాన పరుస్తున్నారు. బ్రాహ్మణులు తప్ప మిగతావారందరూ అంటరానివారనుట వలన, అటువంటి వివక్ష గల మతమునుండి బయటపడి ఎటువంటి వివక్ష చూపని మతము, ఒకే దేవుడు, ఒకే గ్రంథమున్న మతమును ఎంచుకొని ఇందులోనికి వచ్చాము" అంటున్నారు. మీరు దాడులు చేసే బదులు వారికి తెలియని జ్ఞానమును చెప్పియుంటే వారు వేరే మతములోనికి పోయేవారు కాదుకదా!

**నాల్గవవ్యక్తి :-** జ్ఞాన ప్రచారము మీలాంటి స్వామీజీలు చేయవలెను.

**నేను :-** మేము మాచేతనయినంత చేస్తున్నాము. అయితే ఏమాత్రము జ్ఞానము తెలియని కొన్ని హిందూ సంఘములు మేము చెప్పునది జ్ఞానమే కాదంటున్నారు. మమ్ములను మతజ్ఞానమే చెప్పాలని, ఫలానా దేవుని జ్ఞానమే చెప్పాలని నియమములను చెప్పుచున్నారు. మేము అట్లు చెప్పుట అజ్ఞానమగును. మత జ్ఞానము వలన నీ మతము, నా మతము అను ద్వేషభావము వచ్చి అసూయతో ఒకరికొకరు ఘర్షణపడు పరిస్థితి ఏర్పడును. అలా కాకుండుటకు మాలాంటివారు ఆత్మజ్ఞానమునే చెప్పి, మతము అను ధ్యాస లేకుండా చేయగలిగితే, అప్పుడు ఎవరూ మతమును ముఖ్యముగా పెట్టుకోరు. మతములను మారరు. వారి దృష్టి జ్ఞానము మీదికే వచ్చును.

**మొదటివ్యక్తి :-** మీరు చెప్పేది దప్పికకొన్నప్పుడు బావి త్రవ్వాలన్నట్లున్నది.

ఇప్పుడు మతమార్పిడిలు జరిగిపోతుంటే, వాటిని ఆపకుండా జ్ఞానము చెప్పుతూపోతే, అది ప్రజలకు తెలియాలంటే చాలాకాలము పట్టును. అంతలో జరుగవలసినదంతా జరిగిపోయి, హిందువులందరూ క్రైస్తవులుగా మారిపోగలరు. అదంతా అయ్యేపనికాదు. క్రైస్తవుల మీద దాడిచేసి వారి మత ప్రచారమును ఆపవలసిందే. అట్లు కాకపోతే హిందూమతము పూర్తి మారిపోయి ఏమీ లేకుండా పోవును.

**నేను :-** మీరు ఇంతమంది ఇన్ని సంఘములుగా ఏర్పడి దాడులు చేసి ఆపవలెనని కొందరు, మరికొందరు భయపెట్టి మతమార్పిడి జరుగకూడదని చెప్పువారు కొందరు, ఎందరో ఎన్నో రకముల ప్రయత్నములు చేయుచున్నా ఎక్కడయినా మతమార్పిడి ఆగిందా? ఆగలేదు, చాపక్రింద నీరులాగా మత మార్పిడి జరుగుచూనే యున్నది. తెలంగాణ, రాయలసీమ ప్రాంతములో అంతవేగముగా మతమార్పిడి జరుగకున్నా, ఉత్తరాంధ్ర ప్రాంతమంతయూ నూటికి దాదాపు 70 శాతము మంది క్రైస్తవులుగా మారిపోయారు. ఎవరిని కదిలించి చూచినా వారు హిందువులనుండి క్రైస్తవులుగా మారిపోయినట్లు తెలియుచున్నది. మీరు ఇంతకాలముగా ఇన్ని సంఘముల పేర్లతో యుండి అక్కడ ఎందుకు ఆపలేకపోయారు? దానికి ఒకే కారణము కలదు. వారు వారి గ్రంథమును ప్రచారము చేయుచున్నారు. క్రైస్తవులుగా మారినవారు ప్రతి ఒక్కరూ వారి గ్రంథమయిన బైబిలును చదువుతున్నారు. అది హిందువులలో జరుగడము లేదు. నేడు హిందూ సమాజములో మాది ఒక సంఘము అని పేరు పెట్టుకొన్నవారు ఇతర మతములమీద దాడి చేయవలెనను చింత తప్ప, జ్ఞానము చెప్పి మారుస్తామను చింతలేదు. వాస్తవము చెప్పాలంటే హిందూ సమాజ సంఘములలో పనిచేస్తున్నామని చెప్పుచున్న కార్యకర్తలకుగానీ, ఆ సమాజమునకు పెద్దలయిన వారికిగానీ,

హిందూ ధర్మములేవో తెలియవు. హిందూ జ్ఞానమేదో తెలియదు. హిందూ ధర్మములు తెలియనివారు మేము హిందూ పరిషత్‌లో పనిచేయుచున్నామని, మేము హిందూ సంఘములో పని చేయుచున్నామని చెప్పుట తప్ప, వారి వలన హిందూ జ్ఞాన ప్రచారము జరుగదు. దాడుల వలన క్రైస్తవులపట్ల ప్రజలకు సానుభూతి ఏర్పడి, హిందువులనుండి క్రైస్తవులలోనికి సులభముగా పోవుచున్నారు. మతమార్పిడులకు అడ్డుకట్ట వేయాలంటే హిందువులము అని చెప్పుకొనువారికి ముందు హిందూ జ్ఞానము, హిందూ ధర్మము తెలిసి యుండాలి. అప్పుడు హిందూ జ్ఞాన ప్రచారముతో హిందూమతమును కాపాడవచ్చును.

ఈ విధముగా మేము చెప్పడము వలన మా మాటలు అక్కడ వచ్చిన వారికి నచ్చలేదు. మేము జ్ఞానమంటే, వారు దాడులంటారు. అటువంటి వారితో మాట్లాడడము మాకే మంచిది కాదనిపించినది. మంచి మాటలు చెప్పినందుకు మేము కూడా వారి దృష్టిలో అన్యమతమువారిగా వారికి కనిపించాము. నేను చెప్పినది మంచా చెడా అనునది మనుషులకు తెలియకున్నా, దేవునికయినా తెలిసియుండును కదా! దేవుని దృష్టిలో మంచిగా ఉండడమే మా ఉద్దేశ్యము. ఇట్లు అనేక ప్రాంతములలోని హిందువులు అనేక రకములుగా యున్నారు. అయితే భగవద్గీతలో చెప్పిన జ్ఞానమును తెలిసి, హిందూ ధర్మములను తెలిసినవారు అరుదుగాయున్నారు. మిగతా మతములవారు వారి గ్రంథములోని విషయములను చెప్పి ప్రజలను ఆకర్షించుచుండగా, హిందువులు మాత్రము ఆ పనిని చేయడము లేదు. ఆ పనిని స్వామీజీలు చేయాలని చెప్పుచూ, ఒకవైపు వారికి నచ్చిన బోధనే చెప్పాలని, వారికి నచ్చిన దేవున్ని గురించే చెప్పాలను నియమమును గురువులమీద కూడా ఉంచుచున్నారు. అలా చెప్పడము వలన అది

మత జ్ఞానమవుతుందిగానీ, దైవజ్ఞానము కాదు. మతజ్ఞానము వలన మతద్వేషములే వస్తాయిగానీ, మనిషిలో జ్ఞానము రాదు.

ఇకపోతే క్రైస్తవుల అందరిలో జ్ఞానమే ఉందా, పరమత ద్వేషము లేదా? అని ప్రశ్నించి చూచితే అన్ని మతములలోయున్నట్లే క్రైస్తవ మతములో కూడా పరమత ద్వేషము నూటికి నూరుపాళ్ళు గలదు. ఎప్పుడు పరమత ద్వేషముండునో, అప్పుడు వారిలో హింసతో కూడుకొన్న ఉగ్రవాదము కూడా ఉండును. అయితే వారిలోని ఉగ్రవాదము బయటికి కనిపించక ఒక ఫతకము ప్రకారము జరుగుచున్నది. మేము అనుభవించాము కనుక వారి ఉగ్రవాదము ఇలా ఉన్నదని మా అనుభవముతో తెలిసినది.

**ప్రశ్న :- క్రైస్తవ మతము శాంతిమతముగా పేరుగాంచినది. ఒక చెంపమీద కొట్టితే మరొక చెంప చూపమనునది ఏసుప్రభువు బోధ. అటువంటి క్రైస్తవులు శాంత స్వభావులుగాయున్నట్లు, ఎక్కడా ఘర్షణదోరణి లేనట్లు చెప్పుచుందురు. అటువంటి వారిని కూడా మీరు ఉగ్రవాదుల వరుసలో చేర్చడము మంచిదా! అని అడుగుచున్నాము.**

**నేను :-** మేము ఉన్న సత్యమును చెప్పుచున్నాము. బయటికి ఎక్కడా అసూయ కనిపించక, వారి పనిని వారు చేసుకపోయినట్లు కనిపించినా, అందరిలో కాకుండా కొంతమందిలో పరమత ద్వేషము, హింసావాదము కలదని చెప్పుచున్నాము. కొన్ని ప్రత్యక్ష అనుభవములను బట్టి క్రైస్తవులలో కూడా అసూయ వుందని, వారు కూడా ఒక విధముగా ఇతరులను బాధించు ఉగ్రవాదమును కల్గియున్నారని చెప్పవచ్చును. ఒకప్పుడు ఒక క్రైస్తవ మత ప్రచారకుడు, గొప్ప బోధకుడు, వాక్‌చాతుర్యముగల వ్యక్తి హైదరాబాద్ నగరములో బహుశా 2004వ సంవత్సరము రెండు రోజులు ప్రచార

సభలు జరిపి అందులో "సృష్టికర్త కోడ్ 666" అని చెప్పడమే కాక, అదే మాటనే హైదరాబాద్ నగరమంతా ప్రతి గోడమీద వ్రాయడము జరిగినది. ఈ రోజు మేము హిందువులము, హిందూ సంఘమువారము అని చెప్పుకొను ఏ హిందువూ దానిని పట్టించుకోలేదు. ఆ మాటను చూచీచూడనట్లు ఊరకుండిపోయారు. హైదరాబాద్‌లో అన్ని గోడలమీద వ్రాసినా ఇదేమిటి? అని ఆలోచించువారు ఆ రోజు లేరు. ఈ రోజు మేము హిందువులము, హిందూమతమును రక్షించుచున్నామను వారంతా ఆ దినము ఆవులించి నిద్రపోయినట్లుండి పోయారు. ఆ దినము హైదరాబాద్ గోడలమీద వ్రాసిన దానికి స్పందించి, సృష్ఠికర్త అందరికీ సంబంధించిన దేవుడని తలచి, అందరినీ సృష్ఠించిన పరమాత్మయని తెలిసి, ఆ దినము వారు వ్రాసినది వారి బైబిలు ప్రకారము కూడా తప్పని తెలిసి, వారికి జవాబుగా **"సృష్ఠికర్తకోడ్-963"** అను గ్రంథమును వ్రాసి ప్రచురించాము. అంతేకాక వారు ఎక్కడయితే "సృష్టికర్త కోడ్ 666" అని వ్రాశారో దాని ప్రక్కనే మేము "సృష్ఠికర్త కోడ్ 963" అని వ్రాయడము జరిగినది.

అంతేకాక దాదాపు ఆ రోజు ఉమ్మడి ఆంధ్రరాష్ట్రమంతటా వారికి ధీటుగా "సృష్ఠికర్త కోడ్ 963" అని దాదాపు లక్షరూపాయలు ఖర్చుపెట్టి వ్రాయించడము జరిగినది. దానిని చూచిన హిందువులు సంతోషపడ వలసినదిపోయి, మా మీద అసూయపడి మమ్ములను క్రైస్తవ ప్రచారకులుగా భావించి దూషించారు. క్రైస్తవులు సృష్ఠికర్తకోడ్ 666 అని వ్రాయగా స్పందించని హిందూ సంఘములన్నీ, మమ్ములను క్రైస్తవ ప్రచారకులుగా దూషించారు. మేము చేసిన పనికి సంతోషించాల్సినది పోయి దూషించడమును చూచిన క్రైస్తవులు హిందువులలోని అజ్ఞానమును చూచి నవ్వుకొన్నారు. క్రైస్తవులు వ్రాసిన దానికి వ్యతిరేఖముగా వ్రాసినామని

ఒక్క హిందువు కూడా గ్రహించకుండా మమ్ములను హేళనగా మాట్లాడడమే కాక క్రైస్తవులనడము వలన, హిందువులలో చాలా గ్రుడ్డివారున్నారని మాకు కూడా అనుభవపూర్వకముగా తెలిసిపోయినది.

**ప్రశ్న :- మీరు అన్ని మతములు మాకు సమానమే అని చెప్పుచున్నారు కదా! అలాంటప్పుడు మీరు క్రైస్తవులకు వ్యతిరేఖముగా హిందువులకు అనుకూలముగా "సృష్ఠికర్త కోడ్ 963" అని ఎందుకు వ్రాశారు? అలా వ్రాయడము వలన మీరు హిందూమతము వైపు మాట్లాడినట్లే కదా! జ్ఞానమంటే ఏమిటో, మత గ్రంథములంటే ఏమిటో తెలియని హిందూ సంఘములవారు మీరు చేసినది మంచిపనియని గ్రహించకుండాపోయి మిమ్ములను దూషించారు. అలాకాకుండా హిందువులు మీరు క్రైస్తవులకు వ్యతిరేఖముగా చేశారని తెలిసి పొగడియుంటే, మీరు కూడా హిందూ మతమును సమర్థించుచూ, క్రైస్తవమతమును విమర్శించినట్లేయగును కదా! ఎప్పుడయితే మీరు క్రైస్తవులను వ్యతిరేఖించి, సృష్ఠికర్త కోడ్ 963 అని వ్రాశారో భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగమున 16, 17 శ్లోకముల లోనూ, 666 అనుమాట దైవాసుర సంపద్విభాగ యోగమున 14వ శ్లోకమున ఉందని చెప్పినప్పుడే, మీరు హిందూమతమువైపు మాట్లాడినట్లగుచున్నది. దీనినిబట్టి క్రైస్తవ మతము మీద కొంత అసూయయే ఉన్నట్లు తెలియుచున్నది. అలా భగవద్గీతను సమర్థించుచూ, క్రైస్తవులను విమర్శించుట వలన, హిందువులు అజ్ఞాన గ్రుడ్డితనముతో గుర్తించలేకపోయినా, మా దృష్ఠిలో మీరు హిందూమత అభిమానియనీ, క్రైస్తవ మత ద్వేషియనీ కనపడుచున్నది. దీనికి మీరు ఏమని సమాధానము చెప్పగలరు?**

**నా జవాబు :-** నేను మతముల దృష్ఠితో వ్రాయలేదు. నాకు మూడు మతములు సమానమే. నేను మూడు మతములవారికి మార్గదర్శకునిగా

యున్నాను. నేను మూడు మతముల వారికి వారి గ్రంథములలో అర్థము కాని విషయములను వివరముగా చెప్పుచున్నాను. అటువంటప్పుడు ఒక మతము ఎక్కువ, ఒక మతము తక్కువని మా భావములో ఉండదు ఎక్కడ తప్పు జరిగినా, అది ఏ మతములో జరిగినా, అది తప్పు ఇది ఒప్పు అని చెప్పడము నా బాధ్యత. అందువలన క్రైస్తవులలో ఒక బోధకుడు వ్రాసినది బైబిల్ గ్రంథములో చెప్పని విషయమైనందున అది బైబిలుకు కూడా వ్యతిరేఖమే.

బైబిల్‌నందు చిట్టచివరిలో "పరమార్థ జ్ఞానియగు యోహాను వ్రాసిన ప్రకటన గ్రంథము" అను దానిలో 13వ అధ్యాయములో 18వ వాక్యము ***"బుద్ధిగలవాడు మృగము యొక్క సంఖ్యను లెక్కింపనిమ్ము, అది యొక మనుష్యుని సంఖ్యయే, ఆ సంఖ్య ఆర్నూట అరువదియారు. ఇందులో జ్ఞానము కలదు"*** అని ఉన్నది. 13వ అధ్యాయములో మొత్తము అన్ని వాక్యములు చదివి చూస్తే మాయను లేక సాతాన్‌ను మృగము అని అన్నట్లు తెలియుచున్నది. ఈ విషయము యోహాను ప్రకటన గ్రంథము చదివిన ఎవరికైనా అర్థముకాగలదు. వాక్యములో "ఇది యొక మనుష్యుని సంఖ్యయే" అని ఉన్నది. మనిషి సంఖ్య అనియున్నది కానీ, దేవుని సంఖ్య అని అక్కడ లేదు కదా! సాతాను (మాయ) మనిషిలో సులభముగా చేరుచున్నది. కావున అక్కడ మనిషిలో చేరియున్న సాతాను సంఖ్యగా మనము గుర్తించుకోవాలి. మేము మాయకోడ్ చెప్పినప్పుడు కూడా అజ్ఞానమనిషిని చూచినప్పుడు మాయ సంఖ్యను గుర్తించుకోవాలి అని ముందే చెప్పి యున్నాము. యోహాను ప్రకటన వాక్యములో "బుద్ధిగలవాడు మృగము యొక్క సంఖ్యను లెక్కింపనిమ్ము" అని ఉంది కదా! దానిలోని వివరము ప్రకారము 'బుద్ధిగల వాడు' అని ప్రత్యేకముగా చెప్పడములో జ్ఞానము

కలవాడని అర్థమగుచున్నది. జ్ఞానము కల్గినవాడు అజ్ఞానిని చూచినపుడు వానిలోని మాయను 666 గా గుర్తించునని ముందు పేజీలలోనే చెప్పి యున్నాము. తర్వాత అదే వాక్యములో "ఇందులో జ్ఞానము కలదు" అని చెప్పబడియున్నది. దాని వివరమును చూస్తే జ్ఞానము కల్గినవాడు సాధారణ మనిషిలోని మాయను గుర్తించి, మనిషి భావము ప్రకారము లోపలగల సాతాను (మాయను) 666 గా గుర్తించడము జ్ఞానమార్గములో ఉన్నవారికే సాధ్యమగునని, ఇతరులకు తెలియునట్లు ఇందులో జ్ఞానమున్నదని చెప్పారు. దీనినంతటినీ చూస్తే దేవుని జ్ఞానము ప్రకారము జ్ఞానమున్నవాడు, జ్ఞానములేనివాని తలలోపల గల మాయను కనుగొనగలడని ఇతరులకు కూడా అర్థమగుచున్నది. ఎంతో స్పష్టముగా సాతాను సంఖ్య 666 అని యోహాను వాక్యములో ఉండగా, మనము ఇంతకుముందే విలన్ హీరోగా చలామణి అగునని చెప్పుకొన్నట్లు, మాయ దేవునిగా ప్రచారము చేసుకొను చున్నది. అదే విధముగా సాతాన్ మంచి పేరున్న బోధకుని తలలో దూరి తన సంఖ్యను దేవుని సంఖ్యగా ప్రకటింప చేసినది. చిన్నచిన్న బోధకుల నుండి చెప్పించితే దేవుని భక్తులైన వారు నమ్మరేమోనని, ఎవరి చేత చెప్పించితే బాగుండునో వారిని ఎన్నుకొని చెప్పించడము వలన అంతలేనిదే అంత పెద్దాయన చెప్పునా! అని తప్పక నమ్ముదురని దైవజ్ఞాని, ఆత్మజ్ఞాని, జయశాలి అను బిరుదాంకితములుగల బోధకుని చేత "సృష్ఠికర్త కోడ్ 666" అని ఉపన్యాసములలో చెప్పించినది, గోడల మీద వ్రాయించినది. దానిని చూచిన చాలామంది దైవభక్తులు గొప్ప దైవజ్ఞాని, ఆత్మజ్ఞాని అయినవ్యక్తి వ్రాసినమాట నిజమే ఉంటుంది, అని పూర్తిగా నమ్మి దేవుని సంఖ్యను 666 గా గుర్తించుకొని, వారు కూడా సాతాను వలలో చిక్కుకొని పోయారు. ఇది దేవుని సంఖ్యకాదు, సాతాను సంఖ్య అని ఎవరూ ఎదురు

చెప్పలేక, అది దేవుని సంఖ్యయే అయివుంటుంది, దేవుని సంఖ్య కాకుంటే అంతపెద్ద ఆత్మజ్ఞాని అలా చెప్పునా! అని అనుకొన్నారు.

బైబిలును, భగవద్గీతను రెండింటినీ చదివి అందులోని జ్ఞానమును తెలిసిన కొందరు దైవభక్తులు తమ జ్ఞానముచేత 666 అను సంఖ్య ఇటు గీతలో మాయకు గుర్తుగానే కనిపిస్తున్నది, అటు బైబిలులోనూ మాయ (సాతాన్) యొక్క గుర్తుగానే తెలియుచున్నది.

ఈ విధముగా ద్వితీయ దైవగ్రంథమయిన బైబిలుయందు 666 అనునది మాయకు గుర్తుగా చెప్పియుండగా, ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో కూడా మాయకు గుర్తు 666 అని తెలియుచుండుట వలన, ఈ విషయము సృష్టికర్త గుర్తు అని క్రైస్తవులు వ్రాయడము తప్పుగా తెలిసిన నేను, రెండు దైవగ్రంథములను అందరూ అర్థము చేసుకొనులాగున వివరించి చెప్పాను. భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగమునగల 16, 17 శ్లోకముల ఆధారముతో సృష్టికర్త కోడ్ 963 అని చెప్పగలిగాము. దైవ గ్రంథములను తప్పుగా అర్థము చేసుకోకుండా, దైవగ్రంథములకు విలువ, గౌరవము చేకూరునట్లు రెండు గ్రంథములలోని వాక్యములను వివరించి వ్రాశాను. ఏ గ్రంథములో ఎక్కడ 666 మాయ గుర్తని చెప్పారో, ఏ గ్రంథములో 963 దేవుని గుర్తని చెప్పారో వివరించి చెప్పాము. ఇక్కడ మతముల ప్రసక్తిలేదు. గ్రంథముల ప్రసక్తి మాత్రము కలదు. ఆ విషయమును ప్రతి ఒక్కరూ గ్రహించవలెను.

మూడు మత గ్రంథములు ఒకే దేవుడు చెప్పిన జ్ఞానముతో నిండుకొనియున్నవి. వాటిలో తప్పుయుండదు. మనుషులు అర్థము చేసుకోవడములో తప్పులుండవచ్చును. అదే విషయమే ఇక్కడ జరిగినది. భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగమున 16, 17 శ్లోకములలో దేవుని

గుర్తయిన 963 అను సంఖ్య ఎలా గలదో వివరించి చెప్పాము. అట్లే మొదటి దైవగ్రంథమయిన భగవద్గీతలోనే దైవాసుర సంపద్విభాగయోగమున



14వ శ్లోకములో మాయగుర్తు 666 అనునది ఎలా కలదో గణితము ప్రకారము చెప్పాము. ఇక్కడ దైవగ్రంథము యొక్క విశేషతను చెప్పాము తప్ప, మతమను అసూయ నాకులేదు. ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతను ఎలా వివరించి చెప్పామో, అలాగే అదే గౌరవముతో రెండవ దైవ గ్రంథమయిన బైబిలులోని వ్రాతను చూపిస్తూ, అక్కడ కూడా దేవుని గుర్తును, మాయ గుర్తును వివరించి చెప్పాము. బైబిలు గ్రంథములో చివరి పాఠమయిన ***"యోహాన్ వ్రాసిన ప్రకటనల గ్రంథము"*** అను దానియందు 9వ అధ్యాయమున 4వ వచనములో దేవుని గుర్తును సూచించు విషయము కలదు. అది ఇలా వ్రాయబడియున్నది. **(ప్రకటనలు 9-4) "నొసల్లయందు దేవుని ముద్ర లేని మనుషులకే తప్ప భూమి పైనున్న గడ్డికైననూ, ఏ మొక్కలకయిననూ, మరి ఏ వృక్షమున కైనను హాని కలుగజేయకూడదని వాటికి ఆజ్ఞ ఇయ్యబడెను"** అని గలదు. ఈ విధముగా దేవుని ముద్రను లేక దేవుని గుర్తును గురించి చెప్పియుండగా, 13వ అధ్యాయమున 18వ వాక్యములో సాతాను గుర్తును లేక మాయ గుర్తును గురించి ఇట్లు చెప్పియున్నారు చూడండి. **(ప్రకటనలు 13-18) "బుద్ధిగలవాడు మృగముయొక్క సంఖ్యను లెక్కింపనిమ్ము. అది యొక మనుష్యుని సంఖ్యయే. ఆ సంఖ్య ఆర్నూట అరువది ఆరు. ఇందులో జ్ఞానము కలదు"** అని ఉన్నది. ఈ విధముగా భగవద్గీతలో 15, 16 రెండు అధ్యాయములలో 16, 17 రెండు శ్లోకముల యందు దేవుని గుర్తును, 17వ అధ్యాయము 14వ శ్లోకములో మాయ గుర్తును గురించి చెప్పియుండగా, అదే విధముగా బైబిలు గ్రంథములో కూడా ప్రకటనలు అను దానియందు 9వ అధ్యాయము 4వ వాక్యములో దేవుని గుర్తును గురించి, 13వ అధ్యాయము 18వ వాక్యమందు

# సృష్టికర్త కోడ్-963

భగవద్గీత అ.15-శ్లో॥16,17

# మాయ (సాతాన్) కోడ్-666

భగవద్గీత అ.16-శ్లో॥14



రచయిత: త్రైతసిద్ధాంత ఆదికర్త, పీఠాధిపతి

శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

మాయగుర్తును గురించి చెప్పి యున్నారు. ఈ విషయమును తెలియజేయు నిమిత్తము **"సృష్ఠికర్త కోడ్ 963-మాయ కోడ్ 666"** అను గ్రంథమును వ్రాశాము.

సృష్ఠికర్త అను పేరును మా గ్రంథము మీద చూస్తూనే గ్రంథములోని విషయమును చదువకుండా సృష్ఠికర్త అను పదమును క్రైస్తవులే వాడుదురు. హిందువులు ఆ పదమును వాడరు. సృష్ఠికర్త కోడ్ 963 అని వ్రాసినవారు పక్కా క్రైస్తవులేనని కొందరు మమ్ములను ఆరోపించడము జరిగినది. సృష్ఠికర్త అను పదము భగవద్గీతలోయున్నా, అది మా పదముకాదు క్రైస్తవులదే అను హిందువులున్నారంటే ఆశ్చర్యపోనవసరము లేదు. స్వయముగా మేము సృష్ఠికర్త అను పదమును ఉపయోగించడము వలన, హిందూ మత రక్షణ సంఘములను స్థాపించుకొన్నవారే అట్లు అన్నారంటే, హిందువులలో అనగా హిందూ రక్షక సంఘములలో జ్ఞానమెంత గలదో అర్థమగుచున్నది. సృష్ఠికర్త అంటే ప్రపంచమును సృష్ఠించిన దేవుడు అని అర్థముండగా, రెండువేల సంవత్సరముల పూర్వము వచ్చిన క్రైస్తవ మతము వారికి సృష్ఠికర్త అను పదమును లీజుకు (గుత్తకు) ఇచ్చినట్లు హిందువులు మాట్లాడడము మాకు ఆశ్చర్యముగా యున్నా వారి దృష్ఠిలో మేము అజ్ఞానులుగా, అన్యమత ప్రచారకులుగా కనిపించాము. మా గ్రంథము చదవండి మేము వ్రాసిన విషయమునకు మా గ్రంథములో ఎంతో వివరమున్నదని చెప్పినా, మా మాటను వినే స్థితిలో లేకుండా మేము అన్యమత ప్రచారము చేయుచున్నామని కేసులు కూడ మా మీద బనాయించడము జరిగినది.

ఈ విధముగా అన్ని మతములలో కొందరు జ్ఞానులుండగా, ఎందరో అజ్ఞానులున్నారు. అయితే అజ్ఞానులు తాము జ్ఞానులమనిపించుకొనుటకు నిజమైన జ్ఞానులను కూడా అవమానముపాలు చేయుచుందురు. హిందూ

మతములో ఎంతో జ్ఞానముకల్గి, ఎందరికో జ్ఞానమును బోధించుచున్న మమ్ములను అజ్ఞానులని దూషించడము జరిగినది. అయినా ఓర్పుగా మేము దైవజ్ఞానమును తెలియజేయుచున్నాము. మూడు మతముల చేత మేము కొన్ని ఇబ్బందుల పాలయినా ముస్లీమ్‌లకంటే హిందువుల ద్వారా మరియు క్రైస్తవుల ద్వారా ఎక్కువగా బాధింపబడినామని చెప్పవచ్చును. ముస్లీమ్‌లకు వివరము చెప్పితే వినగలరు. అయితే ఇటు హిందువులు వినేస్థితిలో లేకుండా అందరికంటే అన్నీ తెలిసిన జ్ఞానులము అని అనుకొను చున్నారు. మేము ఏమి చెప్పుచున్నాము, ఏమి వ్రాశాము అని కొద్ది మాత్రము కూడా చూడకుండా గ్రుడ్డిగా మాట్లాడుచున్నారు. క్రైస్తవుల విషయానికి వస్తే, వారు "ఇతరులు వ్రాసిన దానిని చదువము. ఇతరులు చెప్పిన దానిని వినము" అని గోడ కట్టుకొన్నారు. అటువంటి స్థితిలో వారు ఏమీ చూడకుండా, ఏమీ చదువకుండా ఉంటూ మా మీద అసూయను ప్రదర్శించుచున్నారు. క్రైస్తవులంటే అందరూ అని అర్థము కాదు, కొందరు మాత్రమే అజ్ఞానముతో మమ్ములను అసూయతో చూస్తూ వారిలోని ఉగ్రవాదమును కనిపించకుండా ప్రయోగిస్తున్నారు.

**ప్రశ్న :- హిందువులు మిమ్ములను అర్థము చేసుకోలేక వ్యతిరేఖించారు. అలాగే ముస్లీమ్‌లు కొన్ని సందర్భములలో బెదిరించారు. వారిది కనిపించే ఉగ్రవాదము అని మీరు అన్నారు. అయితే క్రైస్తవులది కనిపించని ఉగ్ర వాదము అని అన్నారు. అది మీకు ఎట్లు కనిపించినదో? మీరు ఎందుకు అట్లు అన్నారో చెప్పగలరా?**

**జవాబు :-** కనిపించేది కనిపించనిది అంటే ఏమిటో మీకు కొద్దిగా అర్థమయ్యే టట్లు ఒక విషయమును చెప్పుతాను. దానినిబట్టి కనిపించనిది ఎలాగుంటుందో తెలిసిపోతుంది. దోమ మనుషుల చేతుల మీదనో, కాళ్ల

మీదనో కుట్టుతుంది. దోమ కుట్టునప్పుడు కుట్టించుకునే వానికి తెలుస్తుంది, ప్రక్కన చూచే వానికి కూడా తెలుస్తుంది. అయితే చీమ ఎక్కడో లోపల దుస్తులలోనికి పోయి కనిపించకుండా కుట్టుతుంది. చీమ కుట్టినట్లు తెలిసినా అప్పుడు దానిని ఏమి చేయలేము. బయట కనిపించే దోమనయితే దానిని త్రోలవచ్చును. కుట్టిన జాగాలోనుండి వెంటనే తరిమివేయవచ్చును. దోమ కుట్టినట్లు కనిపించుట వలన దానికి తగిన జాగ్రత్త పడవచ్చును. అయితే ఎప్పుడో ఒకప్పుడు కుట్టు చీమకొరకు ముందు ఎటువంటి జాగ్రత్తలు తీసుకోలేము. దోమలు కుట్టితే ఉలిక్కిపడేంత నొప్పి ఉండదు. అయితే దోమకంటే చిన్నగాయున్న చీమకుట్టితే నిద్రలోయున్న మనిషి కూడా లేవగలడు. మెలుకువలో యున్నవాడు ఎగిరిపడేంత నొప్పి కలుగును. దోమ, చీమ విధానము ఎట్లున్నదో అలాగే కనిపించే ఉగ్రవాదము, కనిపించని ఉగ్రవాదము గలదు. దోమకుట్టువలె హిందువులు, ముస్లీమ్‌ల ఉగ్రవాదముండగా, చీమకుట్టువలె క్రైస్తవుల ఉగ్రవాదము కలదు. దోమలు ప్రతి దినము కుట్టునట్లు హిందువుల మరియు ముస్లీమ్‌ల ఉగ్రవాదము ప్రతి దినము ఎక్కడో ఒకచోట జరుగునట్లు తెలియుచున్నది. క్రైస్తవులు ఉగ్రవాదులు కాదు అన్నట్లు చీమలవలె వాటి దారిలో అవి పోయి నట్లుండును. చీమలు మనుషుల జోలికి రావు అన్నట్లుండినా, ఎప్పుడో ఒకప్పుడు మనిషి ఎగిరిపడేటట్లు కుట్టగలవు. అలాగే క్రైస్తవులు సౌమ్యముగా, శాంతముగల వారుగా కనిపించినా, ఎప్పుడో ఒకప్పుడు తమలో కూడా అసూయ ఉన్నట్లు అందరికీ అర్థమగులాగున తమ శత్రు భావమును ఎవరికీ అర్థము కాకుండా, ఎవరికీ తెలియకుండా చేయగలరు. మేము మూడు మతముల జ్ఞానము చెప్పుట వలన, మూడు మతములవారు వారు మా మీద ఉగ్రవాదమును చూపారు.

**ప్రశ్న :- ఉగ్రవాదము అంటే ఇతరులకు హాని కల్గించునదని అర్థము. మీకు హిందువులనుండి, ముస్లీమ్‌లనుండి వ్యతిరేఖత ప్రత్యక్షముగా ఎదురయినది. క్రైస్తవులనుండి వ్యతిరేఖత వచ్చినా వచ్చియుండవచ్చును. అయితే అది కనిపించనిది, ఇతరులు గుర్తు పట్టలేనిదిగాయుండుట వలన మీరు దానిని ఎలా కనుగొన్నారు? ఇది క్రైస్తవుల ఉగ్రవాదమని ఎలా చెప్పగలుగుచున్నారు?**

**జవాబు :-** క్రైస్తవుల ఉగ్రవాదము చీమ కుట్టినట్లుండును. అయినా కుట్టింది చీమేనని కనిపించదు. అలా తెలియకుండా కుట్టేది చీమయేనని అనుకోవలసిందే. కొన్ని సందర్భములలో చీమ కనిపించినా, ఇంత చిన్న చీమ అంతపెద్దగా కుట్టిందా! అని అనుమానము రాగలదు. దోమలు రాత్రిపూటయే బయటికి వస్తాయి. అప్పుడే కుట్టగలవు. అయితే చీమలు పగలు పూట కూడా మనకు సమీపములోనే తిరుగుచూ వాటివలన మనకు ఏ హాని ఉండదన్నట్లుండును. అయినా ఎప్పుడో ఒకప్పుడు దాని కాటు రుచి చూపించును. అలాగే క్రైస్తవులు మన ప్రక్కనే యున్నా వారు ఎవరి జోలికిపోరు. వారు ఇతరులు ఏమన్నా అనినా శాంతముగా ఉంటారని అనుకుంటాము. నేను అదే విధముగా అనుకొనియుంటిని. మనిషి అయినా ప్రతి వాడు గుణములకు లోబడి పని చేయుచుండును. ఏ గుణము దేనిని సూచించితే దానినే మనిషి చేయగలడు. క్రైస్తవులు కూడా మనుషులే అయినందున వారిలో కూడా గుణముల ప్రభావముండును. అసూయ, ఆశ అను రెండు మనిషిలో బలమైన గుణములు. మనిషి జీవితములో ఎక్కువ కాలము ఈ రెండు గుణముల కారణముననే పనిచేయుచుండును. క్రైస్తవులలో కూడా అసూయ ఉండుట వలన, వారికి ముఖ్య ఆధ్యాత్మిక విషయములో అసూయ గుణము పనిచేయుట వలన, వారు కూడా ఎక్కడో ఒకచోట, ఎప్పుడో ఒకప్పుడు తమలోని ద్వేషమును, క్రోధము రూపములో

చూపుదురు. అయినా వారు వారి క్రియలను ప్రత్యక్షముగా చూపక పరోక్షముగా చూపగలరు.

మా అనుభవములోనున్న సంఘటనలను బట్టి వారిది ఎట్లు కనిపించని ఉగ్రవాదమో బాగా తెలియుచున్నది. చాలామంది క్రైస్తవులు హిందువులనుండి క్రైస్తవ మతములోనికి పోయినవారే! చాలామంది అనకుండా ఇప్పుడు క్రైస్తవములో యున్నవారంతా ఒకప్పుడు హిందువులుగా ఉండేవారని చెప్పవచ్చును. స్మశానములో కాపలాయుండు వారిని కాటి కాపర్లంటాము. కాటికాపర్లు దిగువ అనగా 'మాదిగువ' కులము వారుందురు. అది వారి కులవృత్తిగా ఉండును. ఒక ఊరికి ఒక కుటుంబమే వంశ పారంపర్యముగా ఆ పనిని చేయుచుండును. కాటికాపర్ల కుటుంబములోని ఒక వ్యక్తి క్రైస్తవ మతములో చేరడము జరిగినది. అప్పటినుండి క్రైస్తవుని గానే యుంటూ క్రైస్తవ మత కట్టుబాట్లకు బాగా అలవాటుపడ్డాడు. క్రైస్తవ మతములోని జ్ఞానమును తెలియలేదుగానీ, ఆ మతములోయున్న మిగతా అనర్థములన్నిటినీ నేర్చుకొన్నాడు. క్రైస్తవ మతములో ఏమి అనర్థములుండు నని కొందరికి అనుమానము రావచ్చును. ఆ మతములోగానీ, మిగతా ఏ మతములోగానీ జ్ఞానము తప్ప మిగతా మత సంబంధమైన కార్యములన్నీ అనర్థములే. ఏ మతములో అయినాగానీ, దైవజ్ఞానమే నిజమైన అర్థము. అర్థము అనగా ధనము అని కూడా వివరము గలదు. క్రైస్తవ మతములోనికి పోయి అందులోని మతప్రచారమే దేవునిసేవ అనుకొన్నాడు.

మత ప్రచారమును బోధకులే చేయాలను నియమము లేదు. ఎవరయినా తమ చేతనయినంత, వీలయినంత చేయవచ్చునని ముందే వారి పెద్దలు చెప్పడము వలన అదే పనిని చేయాలని నిర్ణయించుకొన్నాడు. హిందూమతమునుండి క్రైస్తవమతములోనికి పోయినవారు తప్పక పేరు

మార్చుకోవలసియుండును. అంతవరకు హిందూమతములో యున్న పేరును వదలి అప్పటినుండి క్రైస్తవ బోధకులు పెట్టిన పేరుతో చెలామణి కావలసియున్నది. కాటికాపర్ల కుటుంబమునుండి క్రైస్తవునిగా మారిన ఆ వ్యక్తికి బాప్తిస్మము ఇచ్చిన బోధకులు ఏమి పేరు పెట్టారో తెలియదు. అయితే ఇక్కడ గుర్తింపుకొరకు మనము అతనిని ప్రభుదాస్ అని పేరు పెట్టు కొందాము. ప్రభుదాస్ క్రైస్తవునిగా మారినా క్రైస్తవములో పెట్టినపేరుతో అతను ఎప్పుడూ పిలిపించుకోలేదు. అతను ఉద్దేశ్యపూర్వకముగానే ఆ పేరుతో చెలామణి కాలేదు. ఆ పేరుతో పిలువబడితే తాను క్రైస్తవుడనని అందరికీ తెలిసిపోవునని, అట్లు తెలియకుండా ఉండవలెననుకొన్నాడు. అతనిది నల్గొండ జిల్లాలో ఒక గ్రామము. తన గ్రామమునకు పోయినప్పుడు మాత్రమే తన ఊరిలోని చర్చికిపోయి, క్రైస్తవునిగా ప్రార్థన చేయు ప్రభుదాస్ మిగతా కాలమంతయూ హైదరాబాద్ నగరములోనే గడిపెడివాడు. తాను టీ.వీ 9 ఛానల్‌లో విలేఖరిగా పని చేస్తూవుండెడివాడు. అట్లు మనుషుల మధ్యలో ఎక్కువగాయున్న ప్రభుదాస్ తన పేరును చెప్పక గిరిధర్ అను హిందూపేరుతో చెలామణి అయ్యేవాడు. అట్లు తనపేరు గిరిధర్ అని చెప్పుకొనుచూ, అందరి దృష్ఠిలో హిందువుగా కనిపించుచూ, హిందూ మతరక్షణ సంస్థలయిన “విశ్వహిందూ పరిషత్”, ఆర్.యస్.యస్ మరియు బి.జె.పి నాయకులతో కలిసిమెలిసి తిరిగి హిందుత్వమును గురించి గొప్పగా మాట్లాడేవాడు. రాజకీయ పార్టీ అయిన బి.జె.పి తో సన్నిహితముగా ఉంటూ, విశ్వహిందూ పరిషత్ వారివద్ద మంచి హిందువుగా పేరుకాంచాడు.

**ప్రశ్న :- మొదట హిందువుగా యున్నవాడు క్రైస్తవునిగా మారిన తర్వాత క్రైస్తవునిగా ఉండునుగానీ, హిందువుగా ఎవడూ ఉండాలని అనుకోడు. అయితే దానికి భిన్నముగా మీరు చెప్పుచున్నారు. క్రైస్తవములోనికి పోయిన**

**తర్వాత దానినే సమర్థిస్తారు గానీ, హిందువులవైపు ఎవడూ పోడు. మీరు చెప్పేది సత్యముగా లేదు, ఒక కథలాగా ఉన్నది.**

**జవాబు :-** మేము జరిగిన, జరుగుచున్న సత్యమునే చెప్పుచున్నాము. ఇందులో కొద్దిగ కూడా అబద్ధము లేదు.

**ప్రశ్న :- అయితే ప్రభుదాస్‌గా పేరు మార్చుకొన్నవాడు గిరిధర్‌గా పిలిపించు కోవడమేమిటి? హిందువులలో కలిసిపోయి మంచి హిందువుగా పేరు తెచ్చుకోవడము ఏమిటి? అట్లున్నప్పుడు అతడు హిందువే అవునుగానీ క్రైస్తవుడు కాదు కదా!**

**జవాబు :-** అటువంటి వానిని ఎవరయినా హిందువే అంటారుగానీ, క్రైస్తవుడు అని అనరు. అతని ఉద్దేశ్యము కూడా తనను ఎవరూ క్రైస్తవుడు అని అనుకోకూడదనీ, అందరూ తనను హిందువుగానే లెక్కించవలెనని అనుకొనెడివాడు. తాను హిందువును అని అందరూ అనుకొనునట్లు ముఖము మీద ఎప్పుడూ కుంకుమబొట్టు పెట్టుకొనేవాడు. అతన్ని చూచిన అందరూ అతనిని స్వచ్ఛమయిన హిందువే అని అనుకొనెడివారు. అతను గిరిధరుని పేరుతో చలామణి అయినా, బొట్టుపెట్టుకొని తిరిగినా, హిందూ నాయకులకు దగ్గరగాయున్నా, చివరకు అందరూ అతనిని హిందువే అని నమ్మినా, మేము మాత్రము అతనిని హిందువని నమ్మలేదు. ఆవు చర్మము కప్పుకొన్న పులిలాగనే లెక్కించాము.

**ప్రశ్న :- అన్ని విధములా హిందువుగాయున్నప్పుడు మీరెందుకు అతనిని అనుమానము చూపుతో చూస్తున్నారు?**

**జవాబు :-** మొదట క్రైస్తవునిగామారిన అతను, తర్వాత హైదరాబాద్‌లో అందరి మధ్య హిందువుగా చలామణి అగు గిరిధర్ అను వ్యక్తి, తన

స్వంత గ్రామమునకు పోయినప్పుడు మాత్రము చర్చికిపోయి ప్రార్థనలు చేసి రావడము జరుగుచున్నది. తన ఊరిలో ఉన్నంతసేపు ముఖాన బొట్టు పెట్టుకోడు. ప్రభుదాస్‌గానే పిలిపించుకొంటాడు. పూర్తి క్రైస్తవునిగానే ఉంటాడు. అక్కడినుండి హైదరాబాద్ వచ్చిన తర్వాత ముఖాన బొట్టు పెట్టుకోవడము, గిరిధర్‌గా పిలిపించుకోవడము, పూర్తి హిందువుగా ఉన్నట్లు చలామణి కావడము జరుగుచున్నది. అంతేకాక హిందూరక్షణ సంఘములతో కలిసి హిందువులవైపు మాట్లాడడము, తాను చేయు విలేఖరి వృత్తిలో కూడా హిందువులను గౌరవించినట్లుండడము జరుగుచున్నది. వాస్తవానికి అతనొక క్రైస్తవుడయి ఉండి అలా నటించడము వలన అతని మీద మాకు అనుమానము ఏర్పడినది.

**ప్రశ్న :- గిరిధర్ అను వ్యక్తి ఒక క్రైస్తవుడనీ, పేరు ప్రభుదాస్ అనీ, అతను గ్రామమునకు వెళ్ళితే చర్చికి పోతాడని మీకు ఎలా తెలిసింది?**

**జవాబు :-** ఒక సంఘటన జరిగేంతవరకు మేము కూడా అతనిని హిందువనే నమ్మియుంటిమి. మా అనుభవములో జరిగిన సంఘటన ద్వారా మేము కొంత ఆలోచించవలసి వచ్చినది. అప్పుడు అతని కుట్ర బయటపడింది. అతనిలోని దురుద్దేశ్యము తెలిసిపోయింది.

**ప్రశ్న :- అతని వలన మీకు ఏమి సంఘటన జరిగింది? అతని మీద ఎలా అనుమానము వచ్చినది?**

**జవాబు :-** 2004వ సంవత్సరము బహుశా మే నెలలో అనుకుంటాను. మా శిష్యులు కొందరు యుగాదినుండి ప్రారంభమయిన క్యాలెండర్‌ను, మేము ప్రత్యేకముగా ప్రచురించిన క్యాలెండరును అక్కడక్కడ ఉచితముగా ఇచ్చేవారు. జనవరి నుండి ప్రారంభమయ్యే క్యాలెండరు క్రైస్తవులదనీ,

యుగాది నుండి ప్రారంభమయ్యే క్యాలెండరు హిందువులదని చెప్పి అక్కడక్కడ ఇచ్చేవారము. మా శిష్యులకు మహానందిలో బంధువులుండగా అక్కడికి పోయి కొన్ని క్యాలెండర్లు ఇవ్వడము జరిగినది. మేము చేయుచున్నది మంచిపనేయైనా, హిందూ సంస్కృతికి బలము చేకూర్చు యుగాది ప్రారంభ క్యాలెండరు ఇచ్చుచున్నా, అక్కడి దేవస్థానమువారు మాతో ఘర్షణకు దిగడము, మీరు అన్యమతమును ప్రచారము చేస్తున్నారని ఆరోపించడము జరిగినది. అక్కడివారు ఘర్షణ పడగా, మావారు ఎంత నచ్చ చెప్పినా, వివరించి చెప్పినా మాకు తెలుసు మీరు హిందువుల ముసుగులోయున్న క్రైస్తవులని వారనడము జరిగినది. అక్కడ ఘర్షణ వాతావరణమును సృష్టించినది టీ.వీ 9 విలేఖరులే. విలేఖరులు అక్కడికి వచ్చి "క్రైస్తవులు వచ్చి ఆలయము ముందర వారి మత ప్రచారము చేయుచున్నారు, కరపత్రములు ఇస్తున్నారని" దేవస్థానము వారిని రెచ్చ గొట్టడము జరిగినది. ఆ విషయమై అందరూ స్పందించి పెద్ద వార్తగా టీ.వీ9 లో చెప్పడము జరిగినది. ఇదంతయూ హైదరాబాద్‌లోయున్న గిరిధర్ వలననే జరిగినదని మాకు తెలియడము జరిగినది.

అప్పటికే ఆరు నెలలనుండి గిరిధర్ మావద్దకు రావడము, మా జ్ఞానమును బాగా అర్థము చేసుకొన్నట్లు చెప్పడము జరిగెడిది. ఎక్కడ మా బోధలు జరుగుచున్నా వాటిలో పాల్గొనేవాడు. అతను అందరివలె జ్ఞానమును తెలుసుకొంటున్నాడని అనుకొనేవారము. అయితే మహానంది సంఘటన తర్వాత అతనిని గురించి కొంత క్రొత్త సమాచారము తెలిసింది. అతను క్రైస్తవునిగా చేరిన తర్వాత పూర్తిగా ఏసు సేవ చేస్తానని, క్రైస్తవ మతమును విస్తరింపజేస్తానని ప్రమాణము చేయడము జరిగినది. బయటికి శాంత స్వభావులుగా కనిపించు క్రైస్తవులలో మరో కోణమునుండి చూస్తే, కొందరు

మాత్రము బయటికి కనిపించకుండా మతప్రచారమును చేయవలెనని నిర్ణయించుకొన్నట్లు తెలియుచున్నది. తమ మతమును విస్తరింపజేయుటకు హిందూ మతములోనున్న గురువులే ఆటంకమని, వారు జ్ఞానమును బోధించకపోతే హిందువులనందరినీ ఆకర్షించవచ్చునని అనుకొన్నారు. ఎక్కడయినా హిందూ జ్ఞానము బాగా చెప్పువారున్నారంటే, అక్కడ ఆ గురువులను జ్ఞానము చెప్పకుండా చేయవలెననీ, ఆ గురువుల వద్దకు ఎవరూ పోకుండా చేయవలెనను పథకమును వారు ముందే నిర్ణయించు కొన్నారు. ఆ పనులను ప్రత్యక్ష శత్రువులుగావుండి చేయుటకు కష్టమని తలచి, కనిపించని శత్రువువలె అనుకూలముగాయుంటూ తమ పని చేయాలనుకొన్నారు. అప్పటినుండి క్రైస్తవుల మతములో చురుకైన యువకులు బయటికి తెలియకుండా తాము హిందువులవలె ఉంటూ, హిందువుల ఆయువు పట్టయిన గురువుల మీద దెబ్బతీస్తే హిందూమతము సులభముగా క్రైస్తవులుగా మారిపోగలరని అనుకొన్నారు. నేడు చాలాచోట్ల ఆ విధముగానే ప్రవర్తించుచున్నారు.

అలా హిందువులుగా ప్రవర్తించి హిందువులలోనే చిచ్చుపెట్టి, హిందువులతోనే హిందూ గురువులను అవమానపరచి, గురువులను ప్రజలకు జ్ఞానము చెప్పకుండా చేయడము, గురువు దగ్గరికి ఎవరినీ పోకుండా చేయడము ముఖ్యమైన పనిగా పెట్టుకొన్నారు. అలాంటి కార్యమును నిర్వర్తించుటకు ప్రభుదాస్ హైదరాబాద్ నగరములో గిరిధర్‌గా పేరుమార్చుకొని, హిందువుగా చెలామణి అగుచూ, మావద్దకు దురుద్దేశ్యముతో రావడము జరిగినది. వచ్చినవాడు మమ్ములను అన్ని విషయములలో గమనిస్తూ, ఏమీ తెలియనివానివలె జ్ఞానము తెలుసుకొను వానివలె వస్తూ పోతూ ఉండెడివాడు. మా శిష్యులు మహానందికి

పోతున్నట్లు, అక్కడ యుగాది నుండి ప్రారంభమయిన క్యాలెండర్లు ఉచితముగా ఇవ్వదలచుకొన్న విషయము మా మాటల ద్వారా గిరిధర్ తెలుసుకొని మహానందిలోయున్న టీ.వీ9 విలేఖరులకు క్రైస్తవులు వచ్చి వారి మత ప్రచార నిమిత్తము కరపత్రములు, క్యాలెండర్లు ఇస్తున్నట్లు చెప్పాడు. ఆ విషయమును దేవస్థానము వారికి తెలియజేసి, ఆ వార్తను కూడా న్యూస్ సెంటర్‌కు ఇమ్మని చెప్పాడు. హైదరాబాద్‌నుండి టీ.వీ9 ఇన్‌చార్జి విలేఖరినని చెప్పడము వలన, అక్కడి విలేఖరులు దేవస్థానము వారిని రెచ్చగొట్టి ఘర్షణ వాతావరణమును సృష్ఠించారు. మేము ఏమి సమాధానము చెప్పినా, ఎంతో వివరముగా మేము హిందువులమేనని చెప్పినా, వారు వినకుండా మీరు ఎవరయినది మాకు తెలుసు అని చెప్పడముతో వీరికి ముందే మమ్ములను గురించి ఒక నిర్ణయములో యున్నారని అర్థమయినది. అక్కడికి టీ.వీ9 విలేఖరులు వచ్చిన తర్వాతనే ఘర్షణ జరుగడమూ, మాకు మీరు ఎవరయినది తెలుసునని వారు చెప్పడము చూస్తే, ఇదేదో ఒక పథకము ప్రకారము జరిగినదని అర్థమయిపోయినది. ఆ విషయమును గురించి కొంత లోతుగా ఆలోచించగా మేము అక్కడికి పోయే విషయము గిరిధర్‌కు తప్ప ఇతరులకు తెలియదనీ, జరిగినదంతా ఇతని ద్వారానే జరిగియుండవచ్చునని కొంత గ్రహించగలిగాము. మా అనుమానము కొద్ది మహానందిలో విచారించగా, మమ్ముల గురించి హైదరాబాదునుండి సమాచారము వచ్చినదని తెలిసినది. అప్పుడు మా దృష్ఠి అంతయూ గిరిధర్ మీదికి ప్రాకినది. మాకు నల్గొండ జిల్లాలో కూడా భక్తులుండడము వలన వారి ద్వారా గిరిధర్ స్వంత ఊరు ఏదయినదీ, అతని స్వంత పేరు ఏమయినది అన్ని వివరములు సేకరించగలిగాము. అంతకుముందే కనపడని ఉగ్రవాదము క్రైస్తవులు నడుపుచున్నట్లు పైకి ఎంతో శాంత స్వభావులుగా కనిపిస్తూ లోపల ఇటువంటి కుట్రలు

చేయుచున్నట్లు తెలిసియుండుట చేత, ప్రభుదాస్ గిరిధర్‌గా యుంటూ అదే పని చేశాడని మాకు అర్థమయినది.

అప్పటినుండి ఆ విషయమును బయటకు చెప్పకుండా అతనిని మానుండి, మా జ్ఞానమునుండి దూరముగా పెట్టడము జరిగినది. ఆ విధముగా కొంతకాలముండగా దాదాపు ఆరు సంవత్సరముల తర్వాత మా జిరాక్స్ షాప్‌లో పనిచేయు అబ్బాయిమీద కొందరు దాడి చేసి కొట్టడము జరిగినది. ఏ కారణము లేనిది అనవసరముగా ఎందుకు దాడి చేశారని మా అబ్బాయి భాస్కరరెడ్డి వారిని అడుగగా క్రైస్తవులు వ్రాసిన ఒక కరపత్రమును చూపి మీరు కరపత్రముల ద్వారా క్రైస్తవ ప్రచారము చేయుచున్నందుకని చెప్పారు. కరపత్రమును ఎవరు వ్రాసినది, ఏ చర్చీ వారు వ్రాసినది అందులో అడ్రస్‌తో సహా ఉండగా, అదే పనిగా దానిని సాకు చూపి కొట్టారని తెలిసినది. కొట్టినది హిందూ పరిషత్‌వారు, హిందూపరిషత్ వారయినా నిష్కారణముగా ఏదో కరపత్రము చూపి, మాకు సంబంధములేని విషయమును చెప్పి కొట్టుటకు కారణము వారిలో ముందే ద్వేషము పెరిగినదని, దానిని ఏదో సాకు చూపి ఆ విధమైన దాడి చేశారని అర్థమయినది. కారణము లేకుండా కొట్టడము వారి తప్పే అయినా, వారు ఏదో మంచి పని చేసినట్లు అనుకొన్నారు. ఆ సంఘటనకు కూడా కారణము గిరిధర్ అని మాకు అర్థమయినది. మేము చాలా కాలమునుండి క్రైస్తవ ప్రచారము చేస్తున్నట్లు గిరిధర్ హిందూ పరిషత్ వారికి చెప్పడము వలన, వారు సత్యాసత్యములను విచారించక వారు చెప్పినది సత్యమేయని నమ్మారు. గిరిధర్ హిందువేనని నమ్ముటవలన, అతను చెప్పిన మాట నిజమే ఉండవచ్చునని నమ్మి, మా మీద దాడి చేయవలెనను ఉద్దేశ్యముతో, ఏదో కరపత్రమును సాకు చూపి దాడి చేయడము జరిగినది.

దాడిచేసిన వారందరూ మాకు పరిచయము ఏమాత్రము లేనివారు. మేము ఎప్పుడూ వారిని చూడలేదు. దాదాపు 25 మంది వచ్చి ఒకవ్యక్తిని కొట్టారు. అక్కడ ఇంకా కొంతమంది ఉంటారని గిరిధర్ చెప్పడమువలన, అంతమంది రావడము జరిగినది. వచ్చినవారు అక్కడ లేనివారిని గూర్చి వాళ్ళు ఉంటారంటనే! అని అడిగిన దానివలన, ఇక్కడ ఎవరుండేది వాళ్ళకు ఎవరో చెప్పి పంపారని అర్థమయినది. ప్రతి దినము కొందరు మావారు అక్కడుండేవారు, ఆ దినము ఆ సమయానికి ఎవరూ లేని దానివలన వారు లేనివారిని అడిగారు. అలా అడిగిన దానినిబట్టి వారికి ముందే ఇతరులు చెప్పి పంపారని అర్థమయినది. రాత్రి 8 గంటలప్పుడు దాడి జరుగగా దాడి చేసిన వారు అందరూ రెండవరోజు పోలీసు వారికి దొరికిపోయారు. దొరికిన వారు గిరిధర్ మీద చెప్పకున్నా, మాకు ఆ విషయమంతయూ అర్థమయినది. మొదటిరోజు రాత్రి 8 గంటలకు జిరాక్స్ షాప్‌లో మా మనిషిని హిందువులు కొట్టగా, రెండవ రోజు రాత్రి 9 గంటలకు మాకు తెలియని హిందువులు గిరిధర్‌ను కొట్టారు. దేవుడు ఆ విధముగా అతనికి శిక్షవేశాడు. అతనిని ఎవరో దాడి చేసి కొట్టారను విషయము కూడా మాకు తర్వాత తెలిసినది. దేవుడు అతనికి తగిన శిక్ష వేశాడని అనుకొన్నాము.

మా జిరాక్స్ షాప్‌లో భాస్కరరెడ్డిని కొట్టిన దానికంటే పదిరెట్లు ఎక్కువగా గిరిధర్ తన్నులు తిని పడిపోవడము జరిగినది. అతను ఆసుపత్రి పాలై పదిరోజులకుగానీ బయటకు రాలేదు. అప్పటినుండి ఇప్పటివరకు అతను మాజోలికి రావడము లేదు. అతను ఏమి చేసినా మేము తెలుసు కుంటామని అనుకున్నాడేమోగానీ, మా విషయమునకు అతను దూరముగా ఉన్నాడనుకొన్నాము. అతను దూరముగాయున్నా అతను చేసిన మహానంది ఘటన, హైదరాబాద్ ఘటన ద్వారా క్రైస్తవులు ఇలా కుట్రలతో తమలోని

మతద్వేషమును చూపుచున్నారని తెలిసినది. క్రైస్తవులలో ఎంతోమంచివారు యున్నా, చీడపురుగులులాగ ఇలాంటి వారు కొందరున్నారని తెలిసినది. అలాంటివారు హిందువులుగా చలామణి అగుచూ హిందువుల వేలు తీసి హిందువుల కన్నేపొడిచినట్లు, హిందూ గురువులను హిందువులతోనే అవమానపరచుచున్నారు. హిందూ గురువులు లేకపోతే హిందువులు జ్ఞానములేనివారై తమవద్దకు వస్తారని, దానితో క్రైస్తవ మతము అభివృద్ధి కాగలదని వారి భావము.

క్రైస్తవులు ఎందరో గిరిధర్‌లాగా కుట్రలు చేయుచూ హిందువులను హిందువుల మీదికే రెచ్చగొట్టుచున్నారు. ఇతర మతముల కుట్రలు తెలియని హిందూ నాయకులు ఇతరులు చెప్పిన మాటను విని, తమ ప్రతాపము హిందువుల మీదనే చూపుచున్నారు. ఇంత తెలివితక్కువ వారిగా హిందువుల నాయకులు ప్రవర్తించుట వలన, క్రైస్తవుల కుట్రలు సులభముగా సాగుచున్నవి. వారి పథకము నెరవేరుచున్నది. దానితో హిందువులకే నష్టము ఏర్పడి హిందూ మతము క్షీణించుచున్నది. ఇది ఒకప్పటి పరిస్థితి కాదు నేటికినీ అలాగే జరుగుచున్నది. నేడు ఇంటర్‌నెట్‌ను ఉపయోగించు కొని ముస్లీమ్ ఉగ్రవాదులు అనేక రకములుగా వారి బలమును పెంచుకొంటున్నారని వార్తలలో వింటున్నాము. ముస్లీమ్‌లు చేయుపనే అందరికీ కనిపించుచున్నది గానీ, మిగతా మతముల వారు చేయు ఉగ్ర వాదము తెరచాటున కనిపించడము లేదు. అన్ని మతముల వారు ఎవరికి చేతనయినంత వారు చేస్తూనేయున్నారు. తెరచాటున ఉగ్రవాదమును క్రైస్తవులు కుట్రలతో చేయుచున్నారు. దానిని తెలియని హిందువులు వారిలోని మతద్వేషమును స్వమతము మీదనే చూపుచున్నారు. నేటికినీ అదే జరుగుచున్నది. మేము వ్రాసినది సత్యమని గ్రహించని హిందువులు, ఇప్పటికీ మమ్ములను పరమత ప్రచారకులుగానే భావించుచున్నారు. వీరి

తెలివి ఏమయిందోగానీ చెప్పినా కన్ను తెరచి చూడలేని స్థితిలోయున్నారు. దానితో క్రైస్తవులు తమ పనిని సులభముగా చేయగలుగుచున్నారు. తమ మతమును సులభముగా పెంచుకోగలుగుచున్నారు.

ఎంతోమంది హిందువులు మతరక్షణ గుంపులుగా, సంఘములుగా ఏర్పడి ఎంత గొంతుచించుకున్నా, ఏమి చేయుచున్నా పరమతములు ఎందుకు పెరిగిపోవుచున్నవి? స్వమతము ఎందుకు క్షీణించి పోవుచున్నదని? గ్రహించలేకపోవుచున్నారు. ఈ మధ్య కాలములో జరిగిన ఒక విషయమును చెప్పెదను వినండి. దానితో క్రైస్తవులు ఎంత కుట్రదారులో హిందువులు ఎంత తెలివితక్కువగా ప్రవర్తించుచున్నారో తెలియగలదు. క్రైస్తవ కుట్ర దారులు తాము హిందువులుగా కనిపిస్తూ, హిందూనాయకులతో సంబంధములు ఏర్పరచుకొని, మేము క్రైస్తవ మతమును గురించి ప్రచారము చేస్తున్నామనీ, రాముడు దేవుడు కాదని అంటున్నామని చెప్పగా, వారి మాటలను నమ్మిన హిందువులు మా గ్రంథములలో ఏమున్నది చూడకుండా, ఏమాత్రము చదవకుండా, మమ్ములను ఇంటర్‌నెట్ 'ఫేస్‌బుక్'లో ఎన్నో పోస్టులు పెట్టి, నానా విధముల దూషించడము జరిగినది. మా గ్రంథము లను చదువమని మా శిష్యులు చెప్పినా వినకుండా, నిజమెంత అబద్ధమెంత అని చూడకుండా, ఎంతోమంది హిందువులు మమ్ములను నిందించడము జరిగినది. ఇదంతా వెనుక కనిపించకుండా క్రైస్తవులు హిందువులను రెచ్చగొట్టుచున్నారని మాకు తెలుసు. ఈ విధముగా హిందువుల వ్రేలుతో హిందువుల కన్నునే పొడవాలని కొందరు ఇతర మతముల వారు చూస్తున్నారు. అదే పనిని చేస్తున్నారు. ఇట్లు ప్రతి మతములోనూ పరమత ద్వేషముండనేయున్నది. పరమత ద్వేషము, స్వమత అభిమానము లేని మతమే లేదు.

నేటికాలములో మేము అసలయిన దేవుని బోధను తెలుపుచూ, అన్ని మతములలోని జ్ఞానమొక్కటేయని, మూడు మతములవారికి తెలియ జేస్తున్నాము. హిందూమతములో కుల పిచ్చి లేకుండా అన్నీ సమానముగా యుండునట్లు బ్రాహ్మణ, వైశ్య, శూద్ర కులముల వారికి ఒకే జ్ఞానమును చెప్పుచూ, కులరహితముగా ఉండునట్లు మా ఆధ్వర్యములో **'ద్రావిడ బ్రాహ్మణ', 'ద్రావిడశ్రేష్ఠి', 'ప్రబోధ సేవాసమితి'** అను మూడు కుల సంఘములను ఏర్పరచాము. అదే విధముగా మూడు మతములవారు సమానముగా మాబోధలు వింటున్నారని తెలియునట్లు, మా ఆధ్వర్యములో మూడు మతముల సంఘములను ఏర్పాటు చేశాము. **ఒకటి 'ఇందూ జ్ఞానవేదిక', రెండవది 'సువార్త క్రైస్తవ సంఘము', మూడవది 'ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ'.** మూడు కుల, మూడు మత సంఘములు మా సమక్షములో ఏకత్రాటి మీద, ఏక జ్ఞానము మీద నడుస్తున్నవి. ఎంతోమంది మూడు మతముల వారు మా వద్ద **"ఒకే దేవుడు, ఒకే జ్ఞానము"** అను సూత్రము మీద కలరు. మిగతా పేజీలలో మా ఆధ్వర్యములోని సంఘములను చూడవచ్చును. దీనిని చూశయినా ఇప్పటినుండి మతద్వేషములను వదలి అందరము ఐకమత్యముగా బ్రతకాలని తెలుపుచున్నాము.

## సమాప్తము

ఒక విషయమును సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో, అట్లే
ఒక విషయమును ఖండించుటకు శాస్త్రము అంతే అవసరమగును.

అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు,
సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.

# ఏ మతములో ఎంత మతద్వేషము?

ప్రముఖుల లేఖ

సాక్షి న్యూస్ పేపరు 21-01-2014



## ఇందు దేశమే ఇండియా!

**హి**మాలయాలకు, వింధ్యపర్వతాలకు మధ్యగా అప్పటి ఆర్యావర్తనం (ఆర్యుల భూభాగం) ఎక్కడ ఉండేదో మన దేశ పటంలో నువ్వు చూశావు. అది బాల చంద్రాకారంగా ఉన్నట్లు కనిపిస్తుంది. అందుకే ఆర్యావర్తానికి ఇందుదేశమని పేరు వచ్చింది. ఇందు దేశమే హిందూదేశమయింది.

రామాయణం పుట్టిన చాలాకాలానికి మహాభారతం పుట్టింది. అది రామాయణం కంటే పెద్ద గ్రంథం. దానిలో చెప్పింది ఆర్యద్రావిడ యుద్ధం కాదు. ఆర్యుల మధ్య ఏర్పడిన కుటుంబకలహమే భారతకథ. భారతంలో చెప్పిన కథలు, ధర్మాలు ఇన్నీ అన్నీ కావు. అవి చాలా అందంగా, గంభీరంగా ఉంటాయి. వీటి అన్నిటికంటే గొప్పదైన భగవద్గీత అనే మహా గ్రంథం మహాభారతంలో ఉన్న కారణాన అది మనకందరికీ ప్రియతమమైనది అయింది. వేల సంవత్సరాల క్రితమే మన దేశంలో ఇలాంటి గొప్ప గ్రంథాలు పుట్టాయి. మహానుభావులే వీటిని రాసి ఉంటారు. ఈ గ్రంథాలు పుట్టి ఇంతకాలం గడిచినా వాటి గురించి తెలుసుకోని పిల్లలు, ప్రయోజనం పొందని పెద్దలు అంటూ ఉండరు.

* నెహ్రూ ఇందిరకు రాసిన లేఖలోనుంచి